8.4.1994 శుక్రవారం. 12 పేజీలు, సంపుటి: 65, సంచిక: 14, విడిప్రతి: రూ. ...


# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి.




# కర్నూలు ఖల్ నాయక్ కోట్లే!

ముఖ్యమంత్రి బంధువులకు తుపాకీలైసెన్సులు, దొంగసారాబట్టీలు, పోలీసు కాపలా,

ప్రత్యర్థులను చంపినా కేసు పెట్టేవారు లేరు -

కర్నూలు జిల్లాలో రాజకీయ హింస అదుపుతప్పుతూంది!

అక్కడ... ''మారణాయుధాలు మూడు తుపాకులు ఆరు తూటాలుగా వర్థిల్లుతున్నాయి. తెలుగుగంగ మాట ఎట్లా వున్నా దొంగసారా పిల్ల కాల్వలలో పారుతోంది. ఏలిన వారి సేవలో వున్న రౌడీలకు, గూండాలకు అక్కడ లాఠీలు దండాలు పెడ్తాయి. ఖాకీలు కాపలా కాస్తాయి. పాపం, పుణ్యం ప్రసక్తి లేకుండా స్వార్థమే పరమార్థంగా అక్కడ హింస రాజ్యం చేస్తోంది. మనవాడైతే చాలు నేరగాడైనా ఫరవాలేదు తేలిగ్గా తుపాకీ లైసెన్సు దొరుకుతుంది...''

ఇదేదో క్రైం సినిమాలో విలన్ స్థావరం అనుకుంటే పప్పులో కాలేసినట్లే! ఇది సాక్షాత్తు మన రాష్ట్రాన్ని ఏలుతున్న ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కరరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్న కర్నూలు జిల్లా సజీవ ముఖచిత్రం.

రాయలసీమ నేపథ్యం తెలిసిన వాళ్లకు ఇది కొత్తవార్త కాకపోవచ్చు. కానీ రాష్ట్రాన్ని నాలుగు కాళ్ల ధర్మదేవత కనుసన్నల్లో నడిపేస్తానని శపథం చేసిన ముఖ్యమంత్రి అండదండలతో ఈ దారుణాలు జరుగుతుండడంతో ఈ వార్తకు కాళ్లొచ్చాయి. ప్రతిపక్షాల కళ్లు పడ్డాయి. ఓటర్ల గుర్తింపు కార్డు సమీక్ష కోసం ఈనెల ఆరోతేదిన నగరానికి వచ్చిన ఎన్నికల ప్రధానాధికారి శేషన్‌కు తెలుగుదేశం పార్టీ, కర్నూలు జిల్లాలో ముఖ్యమంత్రిని వ్యతిరేకిస్తున్న కాంగ్రెస్ పార్టీవారు విడివిడిగా సమర్పించిన వినతిపత్రాల్లోని ''సారాంశం'' ఇది.

## శేషన్ ఎదుట ప్రత్యర్థుల విలవిల

వినతి పత్రాలతోపాటు శేషన్‌కు అందచేసిన చిట్టాలను తిరగేస్తే ముఖ్యమంత్రి ముఠానాయకుడిగా, షోలే సినిమాలోని 'గబ్బర్‌సింగ్'లా కన్పిస్తాడు. కర్నూలు జిల్లా ముఠా తగాదాలతో, హత్యలతో రగులుతున్న రావణ కాష్టం అయితే దానికి కారణభూతుడైన 'ఖల్‌నాయక్' సాక్షాత్తూ ముఖ్యమంత్రేనట. త్వరలో జరుగనున్న కర్నూలు లోక్‌సభ ఉప ఎన్నికలో కొడుకు సూర్యప్రకాష్ రెడ్డి పోటీ చేయడం ఖాయం. కాబట్టి 'ఎన్నికల జాగ్రత్త' చర్యగా అస్మదీయులకు అక్రమంగా తుపాకి లైసెన్సులు ఇప్పించి తస్మదీయులపై దండయాత్రకు రంగం సిద్ధం చేస్తున్నాడట. సొంత గ్రూపుకు చెందినవారు ఎన్ని నేరాల్లో ఇరుక్కున్నప్పటికీ వారిని చేరదీసి భద్రత కోసం పోలీసు రక్షణ ఇప్పిస్తున్నాడట. తెలుగుదేశం అందజేసిన వివరాల ప్రకారం ఒక్క కర్నూలు జిల్లాలోనే ఏడు వందల తుపాకులు వున్నాయట. ఇందులో లైసెన్సు వున్నది ఏ వంతో

కొరవ 10 పేజీలో

# కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు మారవు!

## ఉగాది పంచాంగం

**పశ్చిమ దేశంలో యుద్ధాలు, రక్తపాతం; రాజకీయంగా ఆశ్చర్యకర పరిణామాలు; అధినేతల నీచకృత్యాలు; మెట్టపంటల కంటే మగాణి పైర్లే బాగా పండుతాయి; ఉత్తర ప్రాంతంలో పంటలకు నష్టం; వానలు ఎక్కువ; గాలివాన ప్రమాదం!**

స్వయంపాకుల శ్రీనివాసులు

శ్వేత వరాహకల్పము వైవస్వతమన్వంతరమున 5095 సంవత్సరములు గతచినవి. 5096 పరిగణింపబడును. సంవత్సరమగు భావ నామసంవత్సరము జరుగబోవుచున్నది. సౌరచంద్రమానములందు భావ సంవత్సరముగా, బార్హస్పత్యమానమున సర్వజిత సంవత్సరముగా 1994-95 ఆర్థిక సంవత్సరము జరుగును.

### నవనాయకుల ఫలితము

ఈ సంవత్సరమున రాజా చంద్రుడు, మంత్రి బృహస్పతి, సేనాపతి మేషాధిపతి, అర్ఘాధిపతి బుధుడు, సస్యాధిపతి సూర్యుడు, ధాన్యాధిపతి శుక్రుడు, రసాధిపతి కుజుడు, నీరసాధిపతి శని. నవనాయకులలో 5 మంది శుభులు నలుగురు పాపులు. ఈ ఆధిపత్యములన్నీ సూర్యసంక్రమణ వారములను బట్టి, ఆర్ద్ర కార్తె ప్రవేశ వారమును బట్టి ఏర్పడుచుండును.

రాజా చంద్రుడైనందువల్ల గోధుమలు వరి చెరకు బాగుగా పండును. యజ్ఞాది సత్కర్మలు దేశమంతటా జరుగుచుండును. పాలు సమృద్ధిగా లభించును. మంత్రి గురువైనందువలన దేశంలో రాజకీయ స్థిరత్వముంటుంది. దేశ రాష్ట్ర నాయకులవల్ల ప్రజోపయోగకరమైన నిర్ణయములు అమలు జరుపబడుతాయి. సేనాధిపతి బుధుడైనందువల్ల సైనిక వ్యవస్థ స్థిరముగా కలసికట్టుగా నుండి దేశ ప్రమాదములను నిరోధిస్తుంది. స్త్రీ పురుషులందు కామ ప్రకోపమెక్కువగా నుండును.

మేఘాధిపతియు బుధుడగుట వలన వడగండ్లు, గాలివానలు దేశమును తాకును. దక్షిణ మధ్య ప్రాంతమున రాష్ట్రములందు వానలధికముగా కురియ గలవు. సస్యాధిపతి తది అయినందువల్ల మొదటి పంట అంతగా ఫలించదు. ఉలవలు, శనగలు, కందులు, వేరుశనగ, ఎర్రధాన్యము, మిర్చి, వక్కలు వంటి వస్తువుల పంట బాగున్నను ధరలు పెరుగును. ఎర్రభూములు, పచ్చభూములు బాగుగాపండును. పొగాకు, ప్రత్తివంటి వాటికి సరియైన ధరలు లభించవు.

అర్ఘాధిపతి బుధుడు అయినందున నెయ్యి, కాగితము, ఇనుప వస్తువులు, నూనెలు, గృహనిర్మాణ సామగ్రి వంటి వాటి ధరలు అధికముగా వుండి వ్యాపారమున ఒడిదుడుకులు ఎక్కువగా కన్పిస్తాయి. ధాన్యాధిపతి శుక్రుడైనందువల్ల మెట్ట పంటలకంటే మాగాణి పంటలు బాగుగా పండును. కొన్ని ఉత్తర ప్రాంతములందు పంటలు కొట్టుకొని పోయి నష్టములుండును.

రసాధిపతి చంద్రుడైనందున రసవస్తువులు కూరల ధరలు నిలకడలేకుండును. కొన్ని రసవస్తువుల వ్యాపారము దెబ్బతినవచ్చును. నీరస వస్త్రువులకు అధిపతి శని అగుటవలన లోహములకు ధరలు నిలకడవుండవు. రవాణా చార్జీలు పెరుగ గలవు. ధాన్య వ్యాపారులకు, ప్రభుత్వములకు సమస్యలు పెరుగుట, ఆందోళన లుంటాయి.

### వర్షలగ్న, జగలగ్నములు:

సంవత్సర తిథి ప్రారంభ లగ్నము మీనలగ్నము. లగ్నాధిపతి అష్టమమున నుండుట వలన లగ్నము నకు, లగ్నాధి పతికి, అష్టమమున నుండుట వలనలగ్నమునకు, లగ్నాధి పతికి, షష్టాష్ట మాధిపతుల సంబంధముండుట వలన, రాజకీయ నేతల మధ్య శత్రుమిత్రత్వ ములు మారుచుండును. డబ్బుకొరకు అధినేతలు నీచకృత్యములకు పాల్పడి, పరిపాలన యందు అపకీర్తి పొందెదరు. రవికుజాలు లగ్నమున నుండుటవలన వ్యాపార విద్యుత్ రంగములందు తగిన వృద్ధి వుండదు. ప్రభుత్వములకు ప్రతిపక్షములు అడ్డుపడినను పాలన నిరాటంకముగా కొనసాగును. అయితే ప్రభుత్వములు అనేక అవకతవక పనులుచేసి నిందలపాలగును. జగలగ్నము కూడా మీనలగ్నము అయ్యి షష్టాధిపతి రవి ఉచ్ఛయందుండుట వలన కుజబుధుల గృహార యుద్ధమున బుధుడు

కొరవ 8 పేజీలో

## ఉగాది కానుక

-గ్రిద్దలూరు గోపాలరావు

ఉగాది పర్వదినాన
ఎందుకోకాదు
కొత్తగోచి పెట్టుకున్నందుకు
గర్వపడిపోతున్నాడు
ఆ కుర్రకుంక
పట్టుబట్టలు కట్టుకున్నట్టు
ఇట్టే విర్రవీగి పోతున్నాడు
ఎగిరి గంతులేస్తున్నాడు
మా అయ్య పండక్కు
కొత్తగోచి కొనిపెట్టాడంటూ!ఆ
కుర్రాడి తండ్రి
వాడి తాత, ముత్తాతలంతా
గోచితోనె గడిపారంతా
వంశపారంపర్య హక్కుగా
తరతరాల వారసత్వంగా!
ఉగాదులు ఎన్నివచ్చినా
నిరుపేదల జీవితం
గోచిపాతకే అంకితం!

## నిరీక్షణ

-కె.వి. చలపతిరావు

చీకటి వెంట
వెలుగు తరుముకొస్తున్నట్లు
అపజయాలమాటున
విజయాలు దాగున్నట్లు
నిరాశల వెనుకే
ఆశలన్నీ నిక్షిప్తమైనట్లు
మళ్లీ ఓ ఉగాది తరుముకొస్తోంది
చేదు అనుభవాలన్నీ
తీపి గుర్తులుగా మారనున్నాయన్న ఆశ
కష్టాలన్నీ సుఖాలైన అనుభూతితో
భవిష్యత్తుకే బాటచూపే
ఉగాది కోసమే మళ్లీ ఎదురుచూపు
గతమంతా శూన్యం
భవితవ్యమంతా ఓ ఆశాదీపం
భారమైన బ్రతుకులో
మళ్లీ ఓ చిన్ననిరీక్షణ
ఉగాది కోసమే!





# చెన్నూరు హత్యకేసు-సంచలనాత్మక విచారణ!

గూడూరు సమీపంలోని చెన్నూరు గ్రామంలో 1989 మే 17 తేది రాత్రి జరిగిన జంటహత్యల కేసు నెల్లూరు అడిషనల్ జిల్లా కోర్టులో విచారణకు వచ్చింది. ఆనాటికి జిల్లా తెలుగుదేశం అధ్యక్షుడు శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి ఇందులో ప్రధాన ముద్దాయి కావడంతో కేసు విచారణ సంచలనాత్మకంగా వుంది. విచారణ వివరాల పట్ల ప్రజలు అత్యంత ఆసక్తి చూపుతున్నారు.

చెన్నూరు మొదటి నుంచి గ్రామ కక్షలకు హింసాత్మక రాజకీయాలకు పెట్టింది పేరు. హత్యలు జరిగే నాటికి ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి ఒక వర్గం నాయకుడైతే, పర్వతరెడ్డి శ్రీనివాసులురెడ్డి అనే కాంగ్రెసీయుడు మరొక వర్గం నాయకుడు. ఇద్దరి మధ్య సింగిల్ విండో సొసైటీ ఎన్నికల్లో స్పర్థలు రేగాయి. తాత్కాలికంగా రాజీపడి సర్దుకొన్నా, కొద్దికాలంలోనె అవి రాజుకొని అవి రాజుకొని హత్యలవరకు దారితీశాయి. ఆనాటి దుర్ఘటనలో పర్వత రెడ్డి శ్రీనివాసులురెడ్డి అనుచరులైన జానావెంకటేశ్వర్లు, పంది వెంకట శేషయ్య అనే ఇద్దరు యువకులు హతులైనారు. ఎల్లసిరి, అతడి అనుచరులు కలిసి వీరిని చంపారన్నది అభియోగం.

**న్యాయమూర్తి సమక్షంలో సాక్షుల కథనాలు!**

హత్యలు జరిగేనాటికి తెలుగుదేశం అధికారంలో వున్నందువల్ల, యల్లసిరి ఆనాటికి బలవంతుడైన నాయకుడైనందువల్ల పోలీసు దర్యాప్తు కొంచెం నెమ్మదిగా నడిచిందని ఫిర్యాదు వచ్చింది. హత్య జరిగిన మరునటి రోజు రాత్రివరకు ముద్దాయిలైన ఎల్లసిరి, గూడూరు మండలం మాజీ అధ్యక్షుడు శ్రీ చేవూరు విజయమోహనరెడ్డి అదే గ్రామంలో, తమ ఇళ్లల్లో కదలకుండా వుండినా వారిని అరెస్ట్ చేయడానికి పోలీసులకు ధైర్యం చాలలేదు. ప్రక్కరోజు కూడా నెల్లూరు నుంచి ఆనాటి తెలుగు యువనాయక ద్వయం ఆనం వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి వారిద్దరినీ తమ కారులో ఎక్కించుకొని గూడూరు పోలీసు స్టేషన్‌కు తెచ్చి వదలి పెట్టారు. కేసు ప్రాథమిక దర్యాప్తు విషయంలో పాత్ర ఎల్లసిరి పలుకుబడి ఎంతగా పనిచేసింది దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. అందువల్లే ఈ కేసు విచారణ పట్ల అంత ఆసక్తి కలుగుతున్నది. పాఠకుల సమాచారం కోసం కోర్టుకు హాజరైన సాక్షుల కథనాలు సంక్షిప్తంగా ప్రకటిస్తున్నాము.

### శవం మాత్రమే చూశాను

తొలిసాక్షి - హతుడైన పంది వెంకట శేషయ్య తండ్రి పంది రమణయ్య. ఆయన్ను ప్రాసిక్యూషన్

కొరవ 8 పేజీలో

# ఎవర్ని నిందిస్తారు

పరాష్ట్రంలో కరెంట్ కరువు ఆదుపు తప్పిపోతుంది. ఎటు చూసినా చీకటి తాండవిస్తోంది. ఈ ఏడాది విద్యుత్ కోత వుండదని సాక్షాత్తు విద్యుత్ మంత్రి ఒక వైపు ప్రకటనలు చేస్తుండగానే దీపాలు ఆరిపోయాయి. రోజుకు అధికారికంగా రెండు గంటలకు మించి కోత వుండదని అధికారులు చెప్తున్నా, టౌన్‌లలో కూడా ఆరు నుంచి ఎనిమిది గంటలపాటు అంధకారం అలుముకుంటున్నది. వ్యవసాయానికి 13 గంటలపాటు నిరంతరాయంగా సరఫరా చేస్తామని అసెంబ్లీలో ఇచ్చిన హామీ కూడా వట్టిదే. ఇచ్చే కొద్ది సమయంలోనూ 13 సార్లు సరఫరాకు అంతరాయం కల్గుతున్నది.

పరిశ్రమలు దెబ్బ తినిపోతున్నాయి. వేలాదిమంది తాత్కాలిక ఉద్యోగులు ఉపాధి కోల్పోయి వీధిన పడుతున్నారు. కరెంట్ వినియోగం అధికంగా కల్గిన పరిశ్రమలు ఉత్పత్తి చేసే వస్తువుల ధరలన్నీ ఆకాశానికి అంటుతున్నాయి. స్టీలు టన్నుకు రెండువేల వరకు ధర పెంచారు. సిమెంట్ బస్తా ధర రూ.10లు హెచ్చించారు. సరిగ్గా మూడు నాలుగు గంటలు కూడా మోటార్లు ఆడక రైతులు అల్లాడిపోతున్నారు. షిఫ్టుల వారీగా రమారమి పది గంటలు కరెంట్ కోత ఇస్తున్నప్పటికీ, మధ్య మధ్యలో ట్రిప్ చేయడం వల్ల రైతులు రాత్రి, పగలు పొలాల్లోనే మకాం పెట్టవలసివస్తున్నది. ఒక్కొక్కసారి మోటారు పంపునుంచి నీళ్లు పంట కాలువలో పొలం చేరే లోపలే కరెంట్ పోతున్నది. మధ్యలోనే ఆ నీళ్లు ఇంకి పోతున్నాయి. పైర్లు మాడిపోతున్నాయి. కరెంట్ ఫ్యాన్లకు అలవాటు పడిన ప్రాణం ఉక్కపోత భరించ లేకపోతున్నది. సగం రాత్రి, మిట్ట మధ్యాహ్నం కరెంట్ లేక, ఫ్యాన్లు తిరగక చెమటతో, దోమల బాధతో విసిగి పోతున్నారు ప్రజలు.

చాలా ఆందోళనకరంగా, అలజడిగా వుంది పరిస్థితి. తెలుగుదేశం అధికారంలోకి వచ్చిన నాటినుంచి కరెంట్ కోతకు ప్రజలు అలవాటు పడిపోయినా ఎప్పటికప్పుడు అది కొత్తగానే వుంటున్నది. అందులోనూ, అదును తప్పి కురిసిన వానల వల్ల గత రెండేళ్లుగా విద్యుత్ ఉత్పత్తి బాగుండి కొంత సుఖానికి అలవాటు పడడంతో ఇప్పుడు భరించలేక పోతున్నాము. ఇటు నాగార్జున సాగర్, అటు శ్రీశైలం రిజర్వాయర్లు మూడూ ఎండిపోయాయి. రాష్ట్రంలో 2660 మెగావాట్ల హైడల్ విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యం వుంటే ఈ మూడింటిలో 2620 మెగావాట్లు ఉత్పత్తవుతాయి. అయితే శ్రీశైలం రిజర్వాయర్ నీటిమట్టం 885 అడుగుల నుంచి 786 అడుగులకు పడిపోయి 8 టర్బైన్లూ ఆగిపోయాయి. నాగార్జున సాగర్ నీటిమట్టం 590 నుంచి 505 అడుగులకు దిగజారి విద్యుత్ ఉత్పత్తి నిల్చిపోయింది. ఒక్క సీలేరులో మాత్రం అతి కష్టం మీద 250 మెగావాట్ల కరెంట్ వస్తున్నది. దాని ఉత్పాదన సామర్థ్యం 870 మెగావాట్లు. ఇప్పుడు కేవలం రామగుండం, విజయవాడ వంటి థర్మల్ కేంద్రాలనుంచి వచ్చే 1620 మెగావాట్ల ఉత్పత్తితో సర్దుకు పోవలసి వస్తున్నది. కాని ఇది మొత్తం అవసరంలో మూడవ వంతును కూడా తీర్చేది కాదు. విజయవాడ ఐదవ యూనిట్ (210మె.వా), ముద్దనూరు మొదటి యూనిట్ (210మె.వా) ఉత్పత్తి ప్రారంభించినా గుడ్డిలో మెల్లగా వుపకరిస్తున్నాయి.

వానలు పడనప్పుడల్లా జనం చీకట్లో మ్రగ్గిపోవలసిందేనా? ఎంత కాలం, ఎన్ని సంవత్సరాలు ఈ దుస్థితి ? కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చే రోజు తెలుగుదేశం నికృష్ట పరిపాలన వల్ల విద్యుత్ ఉత్పత్తి పెరగలేదని నిందించి, ప్రజలను మభ్యపెట్టారు. కాని, ఐదేళ్ల తర్వాత అదే పరిస్థితి అంటే, కాంగ్రెస్ చేసిన మేలేమి వున్నట్లు? ఈ ఐదేళ్లలో వారు చిత్తశుద్ధితో వ్యవహరించి వుంటే కృష్ణాపట్నం, విశాఖ పట్నం థర్మల్ కేంద్రాలు; విజ్జేశ్వరం గ్యాస్ కేంద్రం ఒక రూపం సంతరించుకొని వుండేవి. ముద్దనూరు పూర్తి స్థాయిలో

జమీన్‌రైతు

ఉత్పత్తి ప్రారంభించివుండేది. కాని, అవేమీ జరగలేదు. పై రెండు థర్మల్ కేంద్రాలకు ఇప్పటి వరకు ప్రమోటర్ల ఎంపిక కూడా చేయలేదు. ఈ నత్త నడకతో పని జరిగితే అవి ఏ పదేళ్లకోగాని ఉత్పత్తి ప్రారంభించలేవు. అంతకాలం ఈ రాష్ట్రం ఏమి కావాలి? ఈ ప్రజలు ఇంకెన్ని బాధలు పడాలి? కరెంట్ అనేదే లేకుంటే ప్రగతి ఎక్కడి నుంచి వస్తుంది? పరిశ్రమలెట్లా నడుస్తాయి?

ఈ ఏడాది 2000 భారీ పరిశ్రమలకు పూర్తిగా కరెంట్ కట్ చేశారు. అన్ని హైటెన్షన్ పరిశ్రమలకు 60 శాతం కోత విధించారు. చిన్న పరిశ్రమలు అనధికార పవర్ కోతతో చతికిల బడుతున్నాయి. మరి రెండు మూడేళ్లు ఇదే పరిస్థితి కొనసాగితే రాష్ట్రంలో పరిశ్రమ స్థాపించడానికి ఏ సంస్థా ముందుకు రాదు. రాష్ట్ర ప్రగతి ఇప్పుడే మోకాళ్ల మీద నడుస్తుంది; అప్పుడు వెనక్కు తిరిగి దేకుతుంది. కాంగ్రెసు నాయకులు, ప్రభుత్వం ఇక ఎవర్నీ నిందించలేరు. తమ నిర్లక్ష్యం, తమ అశ్రద్ధలకు తామే ప్రజలకు సంజాయిషీ ఇచ్చుకోవాలి. కనీసం ఇప్పటినుంచైనా అదనపు థర్మల్ విద్యుత్ ఉత్పత్తికి చురుకుగా సన్నాహాలు చేసి, ముద్దనూరును సత్వరం పూర్తిచేసి, ఒరిస్సాలోని తాల్చేరు కేంద్రం నుంచి విద్యుత్ సరఫరాకు హైటెన్షన్ తీగలు ఏర్పాటు చేస్తే వచ్చే రెండేళ్ల తర్వాతనైనా రాష్ట్ర ప్రజలకు కరెంట్ కోత శాపం నుంచి విముక్తి లభిస్తుంది.

# అప్పుడు నిద్రపోయి ఇప్పుడు డంకెల్ రంకెలా?

డంకెల్ ప్రతి పాదనలపై పార్లమెంట్‌లో తగు చర్చకు అవకాశం ఇవ్వలేదని ప్రతి పక్షాలు చేస్తున్న ఆరోపణల్లో ఏమాత్రం వాస్తవం లేదు. ప్రతిపక్షాలే ఆత్మవంచనకు పాల్పడ్డాయి. ప్రజలకు నమ్మక ద్రోహం చేసింది చాలక అధికార పక్షాన్ని ఇరకాటంలో పెట్టడానికి డంకెల్ సమస్యను నాటకీయంగా వినియోగించు కున్నాయి. అసలు ఉరుగ్వేరౌండ్ చర్చలు ప్రారంభమైన నాటి నుండి ప్రతి విషయం ప్రభుత్వం పార్లమెంటు దృష్టికి తెస్తూనే వుంది. కాని ప్రతి పక్షాలు ఏ దశలోనూ తమ అభిప్రాయాలు, సూచనలు వెల్లడించలేదు. డంకెల్ ప్రతి పాదనలోని మంచి చెడులను పరిశీలించను 43 మంది ఎంపిలతో మాజీ విదేశాంగ మంత్రి ఐకె గుజ్రాల్ అధ్యక్షతన ఒక స్టాండింగ్ కమిటీ ఏర్పాటయింది. ఈ కమిటీ 93 జూలై నుండి, డిసెంబరు వరకు 24 సార్లు సమావేశం జరిపింది. వీటిలో 4 సార్లు మినహా మిగిలిన 20 సార్లు కమిటీ సభ్యులలో సగం మందికి పైగా సమావేశాలకు హాజరు కాలేదు. ఆగష్టులో జరిగిన అతి కీలక సమావేశానికి కూడా 15 మంది ఎంపిలే హాజరయ్యారు. ఈ ప్రతి పాదనలను తీవ్రంగా వ్యతిరేకించే సిపిఎం ఆర్థిక వేత్త అశోక్‌మిత్రా తాను సభ్యునిగావున్న కాలంలో జరిగిన 8 సమావేశాల్లో ఒక్కదానికీ రాలేదు. ఆదేవిధంగా ఎ.ఎస్.చౌదరి, ఎ.ఆర్. అంతూలే అన్నిటికీ ఎగ్గొట్టారు. వున్నికృష్ణన్ మాత్రం ఒక్క సారి హాజరై, రికార్డు సృష్టించారు. మిగతా ప్రతిపక్ష నాయకులు అంతంత మాత్రంగా విచ్చేశారు. దేశానికి అత్యంత ప్రాముఖ్యమైన సమస్యపై మన రాజకీయ వేత్తలు నాయకులు చూపించిన ఆసక్తికి ఇది ఒక నిదర్శనం అని చెప్పవచ్చు. నిరంతరం అధికారిక పక్షాన్ని ఇరకాట పెట్టడం మినహా ప్రతిపక్షాలు నిర్మాణాత్మక

## జనవాణి

కార్యక్రమాలేవీ చేపట్టక పోవడం జాతి చేసుకున్న దురదృష్టం

ములుమూడి. -పి. జానకిరామరావు.

### కాన్వెంట్లలో అన్యాయం

హై క్లాస్ దోపిడీకి కాన్వెంట్లు సులభ సాధనాలయ్యాయి. ఇంగ్లీషు మీడియం కాన్వెంట్ల పరిస్థితి మరీ ఘోరంగా వుంది. ఏడవ తరగతి పరీక్ష ఫీజు 15 రూపాయలైతే ఈ కాన్వెంట్లలో 70 రూపాయలు వసూలు చేస్తారు. ప్రతి నెల ఫీజుతో పాటు కంప్యూటర్ కోచింగ్, బిల్డింగ్ ఫండ్, యూనివర్సిటీ ఫండ్ అంటూ అదనపు ఫీజులు వసూలు చేస్తున్నారు. మరీ అన్యాయమేమిటంటే కేవలం పక్షం రోజులు కాన్వెంటు జరిగే ఏప్రెల్ నెలతోపాటు, సెలవులు ప్రకటించి వుండే మేనెల ఫీజు కూడా ముందే విద్యార్థుల నుండి తీసుకుంటున్నారు. అపనిచేసే ఉపాధ్యాయులకు మే నెలలో జీతాలివ్వరు. యాజమాన్యాలే భోంచేస్తున్నాయి. ఈ దోపిడీని అరికట్టడంలో కనీస చర్యలు తీసుకోవడంలోజిల్లా విద్యాధికారి విఫలమయ్యారని ఖచ్చితంగా చెప్పవచ్చు.

నెల్లూరు. -ఎస్ కళ్యాణి.

### నిప్పోనే బస్ షెల్టర్ కట్టాలి

ఏప్రెల్ నెల మొదటివారం 'జమీన్‌రైతు' జనవాణి శీర్షికలో నిప్పో వద్ద బస్ షెల్టర్ లేక ప్రజలు పడుతున్న పాట్లను చక్కగా వ్రాశారు. నిప్పో సెంటర్ వద్ద ఏ ఒక్కరూ బస్ షెల్టర్ కట్టవలసిన అవసరంలేదు. ఈ ప్రాంతం మంతా నిప్పో పేరుతో పేరు గాంచింది కాబట్టి శ్రీ ఓబులు రెడ్డి గారు శ్రద్ధ వహించి షెల్టర్ కట్టించమని మనవి. ఇది అటు సంస్థ

కొరవ 10 పేజిలో

---

**7-4-1944**

పేజీలు : 6 వెల : 0-1-6

### పల్లెటూళ్లు

#### వెంకటగిరి మాంసం

మా గ్రామ మధ్యలో మత్స్య మాంసాదుల మార్కెటొకటి ఉన్నది అక్కడకు పోయినవారే యిక జన్మ జన్మానికి ఆ వస్తువుల మీద వాంఛ ఉండదు. అబ్బ! పరమ చండాలమైన గబ్బు.

ఈ విషయం గత పం.బో. ప్రెసిడెంటుగారి పాద పద్మములకు మనవి జేసుకుంటే దాన్ని ఎత్తివేసి, వెనక ఆ ప్రదేశాల కామందులకే అదే ధరకు యిస్తామన్నారు. ఆ ప్రకారం టాంటాం గూడా కొట్టారు.

కాని ఆ రాజ్యం అస్తమించింది. కొత్త ప్రభుత్వం వచ్చింది. మా వూళ్లో 'కొన్నాళ్లు వెన్నెల-కొన్నాళ్లు చీకటి'

జమీన్‌రైతు

మామూలేలెండి. ఆ కథ అట్లా వుంచండి. పోతే ఇప్పుడొచ్చిన మహమ్మదీయసమానాధీరులైన ప్రెసిడెంటు గారినడిగితే వెల్లిగొండ మాదిరి పలకనంటున్నారు.

హెల్తుశాఖ అనేది ఒకటున్నది గదా! వారైనా ఆ మార్కెటును ఆరోగ్యంగా ఎందుకు వుంచకూడదు? ఆ మురికినీళ్లను గూడ ఎత్తిపోయరండి అదేం ఖర్మమోకాని. హెల్తు యిన్స్పెక్టరుగారూ! తమ కాళ్లు కళ్లు ఆ ప్రక్కకు మర్లిస్తురూ మీకు పుణ్యముంటుంది.-పౌరుడు.

### నెల్లూరు ముచ్చట్లు

#### రేషనింగు

రేషన్ కార్డులు తయారౌతున్నవి. అవి 20 తేది ప్రాంతానికి యిళ్లల్లో దూరవచ్చును రేషనింగు యిప్పుడు జరుగదనీ, వాయిదా పడ్డదనీ వుండే పుకార్ సర్వాబద్ధము. పెండ్లికి 30 మందికి తద్దినాలకు 4 గురికి మాత్రం భోజనానికి, అవకాశం యిస్తారట.

**50 ఏళ్ళ క్రితం ఈవారం**

#### వూరగాయలో పురుగులు

ఊరగాయల్లో ప్రతిచోటా పురుగులు పుట్టి చెడిపోతున్నదని చాలామంది చెపుతున్నారు. ఇది ఉప్పులో దోషంగా వుంటుందేమో శాస్త్రజ్ఞులు నిర్ణయించి దీనికి విరుగుడు చెప్పగలరా!

#### తీట

ఇది మద్రాసులో ప్రబలంగా వుండినదట. ప్రయాణ సౌకర్యం లేకపోయినా ఎట్లా వచ్చిందో నెల్లూరంతా ప్రాకిపోయింది. ఆడమొగ భేదంలేకుండా. సిగ్గుయెగ్గు లేకుండా గోకడం విపరీతమైంది. ఈమెకు ఆహుతి వేడి నీళ్లట. కట్టె పుల్లకు కరవైన యీ దినాల్లో యీ దేవతకు వేడి నీళ్లెట్లా సప్లయి చేయగలమో తెలిసిందిగాదు.

కొరవ 10 పేజిలో

# పెన్నపైన రెండవ బ్రిడ్జి- మేలోనే పని మొదలు!

జిల్లా అభివృద్ధి సమీక్షా మండలి సమావేశం సైక్లోన్ షెల్టర్ మీటింగ్ హాలులో 6 తేదీ జిల్లా ఇన్‌చార్జి మంత్రి శ్రీ పెనుమత్స సాంబశివరాజు అధ్యక్షతన జరిగింది. అన్ని శాఖల అధికారులతోపాటు ఎం.పి. కుమారి పద్మశ్రీ, ఎమ్మెల్యేలు జె.కె.రెడ్డి, సివి శేషారెడ్డి, డాక్టర్ సుందర రామిరెడ్డి, నల్లా ప్రకాశరావు పాల్గొని వివిధ అభివృద్ధి పనులపై చర్చించి నిర్ణయాలు తీసుకొన్నారు. వీటిని మధ్యాహ్నం సోమశిల అతిథి గృహంలో మంత్రి, జిల్లా కలెక్టర్ ఎం.సాంబశివరావు విలేఖరులకు వివరించారు. కోవూరు హైవే బ్రిడ్జి నుండి బుజ బుజ నెల్లూరు వరకు నిర్మించే బైపాస్ రోడ్డుకు 22 కోట్ల రూపాయలు మంజూరయ్యాయని, 16.5 కిలోమీటర్ల పొడవు రోడ్డుకోసం 160 ఎకరాల ప్రైవేటు భూమిని కూడా మొన్న మార్చి చివరికల్లా సేకరించినట్లు చెప్పారు. ఇందులో భాగంగా మే నెల మొదటివారంలో పెన్నా నది మీద రెండవ బ్రిడ్జి నిర్మాణపు పని మొదలవుతుందన్నారు. 95 చివరికల్లా పూర్తి చేయాలనే లక్ష్యం పెట్టుకున్నట్లు చెప్పారు.

నెల్లూరు రూరల్ మండలాన్ని రెండు మండలాలుగా విభజించాలని నిర్ణయించారు. మునిసిపాలిటీ ప్రాంతాలతోపాటు కల్లూరుపల్లి, భక్తవత్సల నగర్, వేదాయపాళెంలు కలసి అర్బన్ మండలం అవుతుంది. మిగతా గ్రామాలతో రూరల్ మండలం ఏర్పడుతుంది. ఆత్మకూరు బస్టాండ్ వద్ద అధ్వాన్నంగా వేసిన అండర్ బ్రిడ్జి సిమెంటు రోడ్డు నిర్మాణం అవకతవకలు గూర్చి జాయింట్ కలెక్టర్, ఆర్ అండ్ బి ఎస్.ఇ. చేత విచారణ జరిపించాలని సమావేశం తీర్మానించినట్లు చెప్పారాయన. వేదాయపాళెం, కల్లూరుపల్లి, భక్తవత్సల నగర్ ప్రాంతాలకి తాగునీరు సరఫరా చేసేందుకు 1.9 కోట్ల హడ్కో నిధుల పథకం కోసం ప్రతిపాదనలు పంపారట. అదే విధంగా సోమశిల నుండి కావలిటౌన్‌కు కాల్వ ద్వారా నీరు సప్లై చేసి, అక్కడ ఒక స్టోరేజ్ ట్యాంకు కట్టి సరఫరా చేసేందుకు 6.75 కోట్లు వెచ్చిస్తారు. గూడూరు మంచినీటికి కూడా 11 లక్షలు మంజూరు చేయనున్నారు. ఈ నిర్ణయాలతోపాటు సమీక్షా మండలి ఒక ఇబ్బందికర నిర్ణయం తీసుకొన్నది. ఇక నుండి గ్రామీణ ప్రాంతాల్లో ప్రైవేట్ కుళాయి కనెక్షన్లకు 2 వేలు డిపాజిట్ వసూలు చేస్తారు. ఇంతవరకూ 500 రూపాయల వరకు మాత్రమే వసూలు చేసేవారు. నీటి పథకాల సక్రమ నిర్వహణ కోసం ఈ పెంపని కలెక్టర్ సర్ది చెప్పారనుకోండి. మునిసిపాలిటీలలో మాదిరి గ్రామీణ ప్రజలపై ఇంత భారం వేస్తే కొళాయిలే వద్దు పొమ్మంటారు పల్లెప్రజలు. రాబోయే మూడేళ్లు కూడా ఏటా 15 కోట్ల రూపాయల వంతున సోమశిల ప్రాజెక్టుకు నిధులు కేటాయించి ప్రాజెక్టు పని పూర్తి చేయాలని లక్ష్యం నిర్దేశించామని, ఈ ఏడాది భూసేకరణకు 17 కోట్లు, పనులకు 12 కోట్లు పూర్తిగా ఖర్చు పెట్టినట్లు

కొరవ 11 పేజీలో

### ప్లానింగ్ బోర్డులో నిర్ణయం- 22 కోట్లు మంజూరు!

## సణుగుడు

### * న్యాయవాదులు దారి తప్పుతున్నారు!

నెల్లూరులో న్యాయవ్యవస్థ నిజంగా న్యాయాన్ని అందిస్తున్నదా అని గతవారం నేను వేసిన ప్రశ్న ఎవర్నీ ఉద్దేశించి వేసింది కాదు; ఏ న్యాయమూర్తిని దృష్టిలో పెట్టుకొని వేసింది కాదు. న్యాయమూర్తులపై నాకు గౌరవం వుంది. వారిపై నిందలు వేసే సాహసం నేను చేయను. కాని అందరు న్యాయమూర్తులు నిందార్హులు కానట్లే, అందరు న్యాయమూర్తులూ క్షమార్హులు కూడా కాదు. మినహాయింపు రెండు ప్రక్కలా వుంటుంది; వుంది కూడా! గుమ్మడి కాయల దొంగలనదగినవారు వట్టి భుజాలు తడుముకోవడమే కాదు- గట్టిగా గిరుకుని మరీ చూసుకొని వుంటారేమో!

న్యాయమూర్తులనేవారు కూడా ఈ సమాజపు తానులోని పీలికలే! లోకం కుళ్లి కంపుకొడుతున్నప్పుడు, ఆ లోకంలో వున్న వారికి ఆ వాసన అంటకుండా ఎట్లా వుంటుంది? సంఘం పోకడల ప్రభావం నుంచి తప్పించుకోవడం అందరి తరం కాదు. అది కొందరికే సాధ్యం. అవినీతి చెదపురుగు సర్వ వ్యాపితమై వుంది. న్యాయ వ్యవస్థను మాత్రం అది ఆశించకుండా వుంటుందా? అయితే చెదలు ఆకులకో, కొమ్మలకో పడితే, విదిలించి కాని, ఆక్కడివరకు తెగనరికి కాని నిర్మూలించవచ్చు. వేరులోకి ప్రాకితేనే అసలు చెట్టుకు మోసం వచ్చేది. ఆ ప్రమాదం రాకముందే పారా హుషార్ చెప్పుకోవడం అందరికీ మంచిది.

డోలేంద్ర

న్యాయవ్యవస్థకు సంబంధించి ఈ మేలుకొలుపు పాడవలసింది మొదటగా న్యాయవాదులే. కాని నెల్లూరు న్యాయవాదులు ఆ మాత్రం మెళకువగా వున్నారా? మెళకువ సంగతి దేముడెరుగు, అసలు లోపమంతా వారిలోనే కన్పిస్తున్నది. న్యాయవాద వృత్తి పవిత్రమో, అపవిత్రమో అవతలి సంగతి కాని - విలువైన దనడానికి సందేహం లేదు. స్వాతంత్రోద్యమ కాలంలో, ఆ తర్వాత కొంతకాలం కూడా మేధావి వర్గానికి నాయకత్వం వహించింది న్యాయవాదులే. ఆ చైతన్యం స్థానంలో జడత్వం. ఆ చిత్త శుద్ధికి బదులు చిత్త చాపల్యం. ఆ నిజాయితీ, త్యాగాలకు మారుగా దురాశ, స్వార్థం పెరిగి పోతున్నాయి. ఏ వృత్తికైనా సంపాదన అవసరమే. వృత్తి పరమైన ఆర్జన నేరం కాదు- గౌరవం తెచ్చే నేర్పరితనం. కాని వృత్తి పేరు చెప్పుకుని అడ్డదారులు, వృత్తికి ద్రోహం చేసే అక్రమార్జన ఖచ్చితంగా ఖండించ తగినవి.

కొరవ 7 పేజీలో

# వైశ్యులు రాజకీయాల్లోకి రావాలి!

ఆర్య వైశ్య అఫిషియల్స్ అండ్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్ 18 వ వార్షికోత్సవం, ఆవోప మహిళా విభాగ్ 10 వార్షికోత్సవాలు సంయుక్తంగా 3 తేదీ పాండురంగ అన్నదాన సమాజంలో ఘనంగా జరిగాయి. ముఖ్య అతిథులుగా వైశ్యా బ్యాంక్ ఛైర్మన్ బి.సదాశివ గుప్త, అంబికా కెమికల్ ప్రొడక్ట్స్ అధినేత కృష్ణ సతీ సమేతంగా వచ్చారు. సభను ఆవోప అధ్యక్షులు శ్రీ జి.ఆర్. కృష్ణమూర్తి అధ్యక్షించారు.

ప్రతి మానవునికి కోరికలు తప్పనిసరి. అయితే మితి మీరిన కోరికలు ప్రాణాపాయాన్ని కలుగజేస్తాయి; అభాగ్యుల కోసం కష్టపడి పని చేసినప్పుడే జీవితం సార్థకమవుతుందని వైశ్యా బ్యాంక్ ఛైర్మన్ బి.సదాశివ గుప్త చెప్పారు. సమాజంలో మానవునికి సంస్కారం కొరవడింది. సమాజంలో మన పాత్రను గూర్చి ఆలోచించినప్పుడే ఎదుటి వారికి సహాయ పడగలమన్నారాయన. తాను రాష్ట్రం లోని ఆవోపాలన్నీ తిరిగి వాటి పని తీరును పరిశీలించానని చెబుతూ వాటిలో వ్యక్తిగత వివాదాలకు ఎన్నికతటస్థంగా నిలబడి, పేద రోగులకు సేవలందిస్తున్నది నెల్లూరు ఆవోపా ఒక్కటేనని ప్రశంసించారు. వైశ్యాబ్యాంకులో చక్కని పథకాలు వున్నాయని, దానినుండి ఋణం పొంది కష్టపడి పనిచేసి ఉన్నత శిఖరాలు అధిరోహించాలని కోరారు. అంబికా కృష్ణ మాట్లాడుతూ వైశ్యులు దాన ధర్మాలు చక్కగా చేస్తారని కాని వృత్తి రీత్యా వారి సమస్యలు పరిష్కరించు కోలేకపోతున్నారని అందువల్లే రాజకీయాల్లోకి విశేషంగా రావాలని వైశ్యులకు పిలుపిచ్చారు. అనంతరం ఆర్థికంగా వెనుకబడిన వైశ్యులలో

కొరవ 8 పేజీలో

### అవోప సభలో అంబిక కృష్ణ, వైశ్యాబ్యాంకు చేర్మన్

# పదికోట్లతో మంచినీళ్ళు-డాక్టర్‌గారి పదవిసార్థకం!!

శాసన సభ్యుడు డాక్టర్ సుందర రామిరెడ్డి కృషితో రాజీవ్ నేషనల్ వాటర్ మిషన్ ప్రోగ్రాంకు ఆత్మకూరు నియోజకవర్గాన్ని కేంద్ర ప్రభుత్వం ఎంపిక చేసింది. 7 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి 123గ్రామాల్లో సురక్షిత మంచినీటి పథకాల పనులు చేపడతారు. మంచి నీటికై అల్లాడుతున్న ఈ ప్రాంతీయుల వరప్రదమీ పథకం. 9 నెలల లోపల మొత్తం పథకం నిర్మాణం పూర్తి కావాలి. ఇందుకోసం ఆత్మకూరులో ఒక డివిజన్ ప్రత్యేక కార్యాలయం కూడా ఏర్పాటు చేస్తున్నారు. పథకం మంజూరు చేసినందుకు ప్రధానికి, సి.ఎం.కు డాక్టర్‌గారు థాంక్స్ చెబుతున్నారు. ఈ పథకం తోపాటు నియోజక వర్గంలోని 80 పాఠశాలల్లో తరగతి గదులు నిర్మించేందుకు మరో కోటి రూపాయలను కూడా ఎమ్మెల్యే గప్‌చిప్‌గా మంజూరు చేయించారు. హంగు, ఆర్భాటం లేకుండా తనదైన ధోరణిలో డాక్టర్‌గారు నియోజక వర్గం అభివృద్ధికి ఇన్నేసి కోట్లు మంజూరు చేయించుకొని రావడం నిజంగా అభినందనీయం. ఆయన పదవిని సార్థకం చేసి ఆత్మకూరు ప్రజలు కలకాలం గుర్తు పెట్టుకునేట్లు చేస్తుంది పథకం.

## అల్లూరు ఉపాధ్యాయునికి అపూర్వ సన్మానం

అల్లూరు చరిత్రలో ఇప్పటివరకు ఏ ఉపాధ్యాయునికి జరుగని అపూర్వ సత్కారం ఇటీవల పదవీ విరమణ చేసిన శ్రీ యేదెం మస్తానొరెడ్డికి జరిగింది. ఈ అపూర్వ సత్కారం వెనుక నిరుపమాన, నిస్వార్థ సేవ దాగుంది. ఆయన పేరుకు ఉపాధ్యాయుడైనా, ఎక్కడ సేవా కార్యక్రమాలు జరిగితే అక్కడ ప్రత్యక్షమయ్యేవారు. ఎవరికి ఏ కష్టమొచ్చినా ముందుండి సహాయపడే అరుదైన మనస్తత్వం ఆయనది. అందువల్లే వేలాది ప్రజలు, సహాధ్యాయుల అపరిమిత అభిమానాన్ని సన్మానం రూపంలో పొందగలిగారు.

31వ తేది రామకృష్ణ జూనియర్ కళాశాల గ్రౌండ్‌లో ఏర్పాటైన ఈ పదవీ విరమణ మహోత్సవ సభకు కళాశాల కరస్పాండెంట్ అల్లంపాటి సీతారామిరెడ్డి అధ్యక్షించారు. వక్తగా విచ్చేసిన లయన్ మధుసూధన శాస్త్రి సేవా దృక్పథానికి అర్థం, ఆదర్శం మస్తానొరెడ్డి అన్నారాయన. వయోజన

**జిల్లావార్తలు**

విద్యావ్యాప్తికి ఆయన చేసిన కృషిని ప్రశంసించారు. పదవీ విరమణ తరువాత కూడ తన ప్రతిభా ప్రావీణ్యంతో నిరంతరం మస్తానొరెడ్డి ప్రకాశిస్తారన్న ఆశాభావం మరో వక్త యరమాక ఆదిశేషారెడ్డి వ్యక్తపరిచారు. అనంతరం సుదూర ప్రాంతాల నుండి తరలివచ్చిన పూర్వ విద్యార్థులు, గ్రామస్థులు ఉపాధ్యాయుని పూలమాలలు, దుశ్శాలువాలతో ముంచెత్తారు. సన్మానానికి కృతజ్ఞత చెప్పిన అనంతరం శ్రీ మస్తానొరెడ్డి మాట్లాడుతూ తన ప్రాణమున్నంత వరకూ పదిమందికి ఉపయోగపడే పనులు చేస్తుంటానన్నారు. సేవ చేసేందుకు మదర్ థెరిస్సా తనకు ఆదర్శమన్నారు. తాను అంతకు మునుపు చదువుకొన్న వివేకానంద అప్పర్ ప్రైమరీ స్కూల్ అభివృద్ధికి 35 వేలు విరాళంగా ప్రకటించారు. ఈ కార్యక్రమాన్ని మరింత ఆహ్లాద పరుస్తూ గేయధార సృష్టికర్త వెంకటగిరి మాజీ సంస్థానాధీశుడు సాయికృష్ణ యాచేంద్ర సాహితీ సమ్మేళన విభావరి చేసి ప్రేక్షకులను సమ్మోహితులను చేశారు. అనంతరం పాట కచ్చేరి కూడ జరిగింది.

## లేగుంటపాడు రమణాశ్రమం

లేగుంటపాడులో రమణ మహర్షి ఆశ్రమాన్ని ఎస్.పి. శ్రీ రమణమూర్తి 15 వ తేది ప్రారంభిస్తారు. గత నలభై యేళ్లుగా అఖండానంద ఆశ్రమంగా వున్న దీని పేరు ఎందువల్లో 80 ఏళ్ల అఖండానంద యోగి పేరు మారుస్తున్నారు. రమణ మహర్షి 45వ వర్థంతిని పురస్కరించుకొని 13, 14, 15 తేదీలలో ఆశ్రమంలో వివిధ కార్యక్రమాలు ఏర్పాటయ్యాయి. 13 తేదీ అధ్యాత్మిక సభలో డాక్టర్ ఎ.సోమశేఖరం, లెక్చరర్లు గానుపంటి నారాయణ రెడ్డి, రామయ్య విచ్చేసి ప్రసంగిస్తారు. 14 తేది డి.బి.రెడ్డి ఉపన్యాసకులు; 15 తేది వాల్మీకి రామాయణం - ధర్మ దృష్టిపై పి.బిమోనా పుపన్యసిస్తారని కార్యక్రమ నిర్వాహకులు ఎస్.గోపాలరెడ్డి తెలియ జేస్తున్నారు.

# ఎన్నికలకోసం ఎర్రకామ్రేడ్స్ అల్లూరుభూమిలో నిప్పు రాజేస్తున్నారు!

ఓడిపోయిన షాకు నుండి ఇన్నాళ్లకు మళ్లీ తేరుకున్న సిపిఎం పార్టీ అల్లూరులో 1 తేదీ సర్వసభ్య సమావేశాన్ని పెట్టడం ద్వారా తన కార్యక్రమాలను తిరిగి మొదలు పెట్టింది. పఠాన్ గౌస్‌ఖాన్ అధ్యక్షతన జరిగిన సమావేశంలో మండలంలో వందలాది ఎకరాల ప్రభుత్వ భూమి కబ్జా చేసుకుని వున్న వారిపై పోరాటం చేయను రంగం సిద్ధం చేయాలని తీర్మానించారు. ఇటీవలే తొలి విజయంగా గోగుల పల్లి రొయ్యల భూముల పంపిణీ విషయంలో పోరాడి ఎమ్మార్వోను బదిలీ చేయించి బోణీ చేసుకుని ఊపు మీదవున్నారు. కామ్రేడ్లు; మిత్ర పక్షమైన తమకే ఈసారి అల్లూరు సీటివ్వాలని చెవి తెగిన మేకలా అరుస్తున్నారు. పార్టీ అభివృద్ధికి కృషి చేయక పోయినా విధేయుడుగా వున్నందుకే మాజీ కన్వీనర్ ఆర్.బాబూరావుకే ఆ పదవిని తెలుగుదేశం కట్టబెట్టింది. రాబోయే ఎన్నికల్లో ఎవరికి సీటిచ్చినా తమకు ఢోకా లేదన్న ధోరణిలో కాంగ్రెస్ పార్టీ వుంది. ఎన్టీఆర్ ఏదో ఒక సాకుచూపి మొండిచేయి చూపకుంటే సిపిఎంయే ఇక్కడ పోటీ చేయడం ఖాయమని చెప్పవచ్చు.

# సంతాపం

చక్కెర ఫ్యాక్టరీ అభివృద్ధికోసం, రైతుల శ్రేయస్సు కోసం, వాళ్ల జీవితాలలో వెలుగులు విరజిమ్మాలని అణువణువునా పరితపించి అందుకోసం ఆరాటపడి, ఆ పోరాటంలో మరణించిన త్యాగశీలి వహబ్ భాయ్! ఆయన జన్మచరితార్థం!

నేటి సమాజంలో తరిగిపోతున్న విలువలను, సాటి మానవుల కష్టాలను, మానతా ధర్మాన్ని పునరుద్ధరించాలని ఆయన జీవన యాత్ర సాగిస్తుంటే "మృత్యువు" అనే రాక్షసి ఆయన్ను నిర్దాక్షిణ్యంగా కబళించి ఆయనను మాకు దూరం చేసిన ఆ మృత్యువుకు మరణమెప్పుడొస్తుందో?

నీ ఆదర్శాల బాటలో మేమూ పయనిస్తామని నీ ఆశయాలు నెరవేర్చేందుకు మేము కృషి చేస్తామని ప్రమాణం చేస్తూ, మీ ఆత్మకు శాంతిని ప్రసాదించమని, ఈసుని, ఏసుని, అల్లాను ప్రార్థిస్తూ మీకు అంజలి ఘటిస్తూ-

**మహమ్మద్ వహాబ్‌జాన్**

కోవూరు పంచదార కర్మాగారము
కేన్ కమిటి మేనేజిమెంట్ మెంబరు

మరణం : 1-4-94.

పాలక వర్గము
కేన్ కమిటీ మేనేజిమెంట్ మెంబర్లు,
చెరకు రైతులు
కోవూరు సహకార పంచదార కర్మాగారము, నెల్లూరు.

# నెల్లూరు నలుచెరగుల్లో
## విమర్శకుడు

### జనార్దనరెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి 3 తేది హైదరాబాదు వెళ్లారు; అక్కడినుంచి ఢిల్లీ 15 తేది ప్రాంతంలో నెల్లూరు రావచ్చు.

### నువ్వుల కోలుకుంటున్నారు

రాపూరు శాసన సభ్యుడు శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు తిరుపతి స్విమ్స్‌లో కోలుకుంటున్నారు. ఇప్పుడు కొంచెం స్వస్థతగా వుంది కాని, మామూలుగా తిరగగల్గడానికి చాలా కాలం పట్టవచ్చు. ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి ఆయన్ను ఆస్పత్రిలో పరామర్శించారు.

### రంగనాథుడికి నిత్యకళ్యాణం

రంగనాయకులపేట, శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి దేవాలయంలో ఉగాది నుంచి నిత్యకల్యాణ మహోత్సవం నిర్వహించాలని ధర్మకర్తల మండలి నిర్ణయించింది. తిరుమల వెంకటేశ్వరుడికి జరిగినట్లే ఇకనుంచి రంగనాథుడికి కూడా ప్రతిరోజూ పెండ్లి జరుగుతుంది. రు350లు చెల్లిస్తే భక్తుల పేరట కళ్యాణం జరుపుతారు. తిరుమలలోవలెనే ఉత్సవమూర్తికి ధరింప జేసిన వస్త్రం, లడ్డు వగైరా ప్రసాదం ఉభయ కర్తలకు బహూకరిస్తారు. తిరుమలలో కళ్యాణం చేయించడం ఏదో ఒక కారణంతో వీలుకాని వారికి అందుబాటైన పుణ్యకార్యం ఇది. వివరాలు దేవస్థానంలో తెలుసుకోవచ్చు.



### ఎఎస్‌పి బదలీ

నెల్లూరు అడిషనల్ పోలీసు సూపరింటెండెంట్ శ్రీ గోపాల కృష్ణను హైదరాబాదుకు బదలీ చేశారు. అక్కడ స్పెషల్ సెక్యూరిటీ ఫోర్స్ స్క్వాడ్రన్ కమాండర్‌గా వుండిన వేణుగోపాల కృష్ణను ఎఎస్‌పిగా నియమించారు.

గోపాలకృష్ణకు బదలీ రావడం ఇది ఐదవసారి. మొదట నాలుగు సార్లు రద్దు చేయించుకున్నారు. ఆయన పలుకుబడి అటువంటిది. పోలీసు అధికారిగా పనితనం ఎట్లా వుంటుందో చూసే అవకాశం మాత్రం నెల్లూరీయుల కెప్పుడు లభించలేదు.

### రాయప్రోలు జయంతి

జమీన్‌రైతు శ్రీరామమూర్తి గారు ఏర్పర్చిన నిధినుంచి, కవయిత్రి పెనుబల్లి జయలక్ష్మమ్మ స్మృత్యంకంగా వర్ధమాన సమాజం నిర్వహించే రాయప్రోలు జయంతి సభ 10 తేది ఆదివారం సాయంత్రం టౌన్‌హాల్‌లో జరుగుతుంది. శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు రాయప్రోలు కవిత్వంపై ప్రసంగిస్తారు. అందర్నీ రమ్మని పిలుస్తున్నారు సమాజాధ్యక్షులు శ్రీ పివి రమణారెడ్డి.

### ఖాకీల కామకత్వానికి పసిపాప ఆత్మార్పణం

వింటేనే కడుపు మండిపోయే, రక్తం కుతుకుత వుడికే దుర్మార్గం ఇది. మూలపేట నీలగిరి సంఘంలో నివసిస్తున్న పోస్టల్‌వ్యాన్ డ్రైవరు ఎ.మాల్యాద్రి కుమార్తె, పినరు తీరని పసిబిడ్డ విజయలక్ష్మి(13) ఇద్దరు రిజర్వు కానిస్టేబిళ్ల కాముకత్వానికి బలైపోయింది. ఏడవ తరగతి చదివే ఈ చిన్నపాపను మణి, దేవ అనే ఇద్దరు నీకృష్టులు తరచు వేధిస్తుండేవారట. ఆ నీచులిద్దరూ పోలీసు కానిస్టేబిళ్లు కావడంతో ఆ పాపగాని, తల్లిదండ్రులుగాని వారికి భయపడి తమలోనే కుమిలి పోయేవారట. 4తేది మధ్యాహ్నం స్కూలు నుంచి వంటరిగా తిరిగి వస్తున్న ఆ పాపను ఈ నీచులిద్దరూ బలవంతంగా ఎత్తుకపోయి, ఒక గదిలో బంధించి, ఒకరి తర్వాత ఒకరుగా అత్యాచారం చేశారు. పాప కేకలకు చుట్టూ జనం చేరడంతో వారిద్దరూ పారిపోయారట. ఈలోగా ఆమె తల్లి వచ్చి పాపను ఇంటికి తీసుకవెళ్లింది. అయితే తనకు జరిగిన అవమానాన్ని తట్టుకోలేని ఆ పసికూన ప్రక్కరోజు ఉదయం తన ఇంటి గదిలోని ఫ్యాన్‌కు చీరతో వురివేసు... చనిపోయింది.

పోలీసుల... ఆ ఇద్దరు నీచులను అరెస్టుచేసి, రిమాండ్‌కు పంపారు. పోస్టుమార్టం రిపోర్టులో అత్యాచారం జరిగినట్లు రుజువైంది. ఇటువంటి కాముకులను అరెస్టులు, రిమాండ్‌లతో శిక్షించడం కంటే నడివీధిలో జనం చేత రాళ్లతో కొట్టించే వీలుంటే, తగిన బుద్ధి వస్తుంది.

### డయాబిటిస్ క్లినిక్

నెల్లూరులో పేరున్న డయాబెటాలజిస్ట్ డాక్టర్ ఎస్ సత్యనారాయణ మూర్తి పొగతోటలో స్వంతంగా నిర్మించుకున్న డయాబిటిస్ క్లినిక్‌ను 6 తేది ప్రారంభింప జేశారు. ఆధునాతన, సమగ్ర లాబరేటరీ, స్పెక్ట్రో ఫోటో మీటరు వంటి పరికరాలు, కంప్యూటర్ వ్యాధి నిర్ధారణ విభాగం కల్గిన క్లినిక్ రాష్ట్రంలో అతి కొద్ది ఆధునిక డయాబిటిస్ క్లినిక్‌లలో ఒకటిగా గుర్తింపు పొందుతూంది. అక్కడే డయాబిటిక్ క్యాంటీన్‌నూ ప్రారంభించారు. మద్రాసు, డాక్టర్ వి. మోహన్ దీనికి రిబ్బను కత్తిరించారు.

సత్యనారాయణమూర్తి మంచి డాక్టరు. పదేళ్ల ప్రాక్టీసులో 40 ఉచిత వైద్య శిబిరాలు నిర్వహించిన సేవాజీవి. ఆయనకు మా అభినందనలు.

### సుకుమార్‌రెడ్డి రక్తదాన రజతోత్సవం

రక్తదాన, నేత్రదాన ప్రచారాలే తన జీవిత లక్ష్యంగా నిర్దేశించుకొని వేరొక వ్యాపకం లేకుండా తిరిగే శ్రీ తిక్కవరపు సుకుమార్ రెడ్డి 25 వసారి తన రక్తాన్ని దానంచేసి రజతోత్సవం చేసుకొన్నారు. 1975 నుంచి మొన్న ఏప్రిల్ 1 తేది మధ్య ఆయన మొత్తం 25 సార్లు రక్తం దానం చేసి, అందరు రోగుల ప్రాణాలు కాపాడారు.

ఆదర్శప్రాయమైన, మానవీయ మానవసేవలో తన జీవితాన్ని ధన్యం చేసుకుంటున్న సుకుమార్‌రెడ్డికి అభినందనలు.

### ఆర్టీసి సమ్మె

రాష్ట్రవ్యాప్త సమ్మెలో భాగంగా నెల్లూరులో కూడా 4 తేది ఆర్టీసి బస్సులు నిల్చిపోయాయి. మొత్తం

కొరవ 7 పేజీలో

# పుణ్యసంస్మరణ

మాన్యుడు, మరపురాని మా నేత

## సోమిరెడ్డి రాజగోపాలరెడ్డి గారు

(శ్రీనివాస మహల్ రాజయ్య)



కీర్తిశేషులై ఏప్రెల్ 6వ తేదికి పదకొండు సంవత్సరాలు నిండాయి
ఈ సంతాప దినం సందర్భంలో ఆ పుణ్యమూర్తిని
సంస్మరిస్తూ వారి పవిత్రాత్మకు

## భక్త్యాంజలి ఘటిస్తున్నాము

సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి — సోమిరెడ్డి హర్షవర్ధన్ రెడ్డి

కట్టంరెడ్డి సంయుక్త ← కుమార్తెలు → కేతిరెడ్డి ఉష

మరియు కుటుంబ సభ్యులు

## సణుగుడు

(4 పేజీ కొరవ)

నెల్లూరు న్యాయవాదులలో కొందరి ప్రవర్తన ఈ రెండో కోవకు చెందుతున్నది. ఆ కొందరివల్ల అందరికీ మచ్చ ఏర్పడుతున్నది. లీగల్ పాయింట్లు వెతికిపట్టి బల్ల గుద్ది వాదించి, అవతలి వారిని అయోమయంలోకి నెట్టి కేసు గెలవడం న్యాయవాదికి పేరు, డబ్బు తెచ్చే నైపుణ్యం. కాని లా పుస్తకాలు ప్రక్కన

పారేసి దొడ్డి దార్లలో, బేరసారాలలో, ప్రలోభాలతో కేసు గెల్చిస్తామని క్లయింట్లతో నేరుగా చెప్పి, రేటు కుదుర్చుకుంటున్న లాయర్లు ఏ కోవకు చెందుతారు? రోడ్డు యాక్సిడెంట్ కేసుల విషయంలో కొందరు లాయర్ల గురించి వినబడుతున్న వార్తలు వింటుంటే ఏహ్యభావం కల్గుతున్నది. పోలీసు స్టేషన్లతో నిత్య సంబంధాలు, కానిస్టేబుళ్లతో కమీషన్లు కుదుర్చుకొని, తామైతే బెయిల్ స్టేషన్‌లోనే ఇప్పిస్తామని నమ్మ బలికి ప్రాక్టీస్ పెంచుకోజూస్తున్న లాయర్లూ వున్నారు.

ఈ పరుగు పందెంలో పడిపోయిన న్యాయవాదులు, ఇక న్యాయస్థానాల పవిత్రతపై ఎట్లా సమీక్ష చేయగల్గుతారు? ఎట్లా ప్రశ్నించగల్గుతారు? బార్ అసోసియేషన్ వంటి సంస్థలైనా పూనుకొని దిగజారి పోతున్న న్యాయవాదుల ప్రవర్తనకు హద్దులు నిర్ణయించడం, ప్రవర్తన నియమావళిని ఉల్లంఘించిన వారిని అదుపు చేయడం అవసరం కాదా?

## నెల్లూరు ముచ్చట్లు

6వ పేజీ కొరవ

1120 బస్సులూ గ్యారేజిలో వుండి పోయాయి. 8446 మంది సిబ్బంది గైర్హాజరైనారు. రీజియన్‌కు 28 లక్షలు నష్టం.

### మార్కెట్ యార్డ్‌లో పెసలుకొనుగోలు

జిల్లాలో రైతులు తమ పెసర పంటను అమ్ముకోవడానికి మార్కెట్ యార్డులో ఏర్పాటు చేశారు. వ్యాపారులు రైతుల ఇళ్ల దగ్గరకాని, మిల్లుల వద్దకాని, పెసలు కొనడం నిషేధించారు. రైతులు యార్డుకు తెచ్చి వేలం ద్వారా అమ్ముకోవడం, గిట్టుబాటు ధర రాకుంటే గోడవున్స్‌లోనె నిల్వచేసుకొని రుణం పొందడం చేయవచ్చని శ్రీ పోతల వెంకట కృష్ణారెడ్డి తెలియచేస్తున్నారు. యార్డులో రైతులకు కావలసిన వసతులన్నీ కల్పించారు.

### జగజ్జీవన్‌రామ్ భవంతికి 5 లక్షలు

కస్తూరిబా కళాక్షేత్రంలో 5 తేదీ బాబు జగజ్జీవన్‌రామ్ 87 జయంతి సభ జరిగింది. నెల్లూరు ఎమ్మెల్యే జె.కె.రెడ్డి, గూడూరు ఎమ్మెల్యే పత్రా ప్రకాశరావు, కలెక్టర్ ఎం.సాంబశివరావు ముఖ్య అతిథులుగా విచ్చేశారు. షెడ్యూల్ కులాలు, తెగలలోని కుటుంబాలు విద్య నేర్చుకొని తద్వారా అభివృద్ధి చెందాలని శాసన సభ్యుడు పత్రా ప్రకాశరావు కోరారు. బాబు జగజ్జీవన్‌రామ్ బడుగు వర్గాలకు చేసిన సేవలు మరవకూడదన్నారు. నెల్లూరులో జగజ్జీవన్‌రామ్ స్మారకభవన నిర్మాణానికి 5 లక్షలు మంజూరు చేసినట్లు ఎమ్మెల్యే జె.కె.రెడ్డి చెప్పారు. అరుంధతీయులు తమ బిడ్డలను మాతమ్మలుగా మార్చి బలి చేయవద్దని జిల్లా కలెక్టర్ ఎం.సాంబశివరావు విజ్ఞప్తి చేశారు.

## ప్రకటన

నా క్లైంట్ యండి రఫీఉద్దీన్ అహమ్మద్ తండ్రి Sk. సొబాన్ ఫెంకటాచలం, ఇచ్చిన సంజీయిషీ మేరకు ఈ విధముగా ప్రకటించడమైనది.

నా క్లైంట్ సోదరుడు యండి. గయాజాద్దీన్ అహమ్మద్ 1-4-1994 ఐమీజారైతులో ఇచ్చిన ప్రకటన యదార్థము గాదు. ఆ ప్రకటనలో తెలుపబడిన ఆస్థిలో మా కక్షిదారుడు సమాన హ క్కు కలిగి ఉన్నారు. సదరు ఆస్తి కొన్న యెడల మా కక్షిదారుని హక్కును బద్ధగించదు.

వివి. సుబ్బారెడ్డి
అడ్వొకేటు, నెల్లూరు.



## DEMISE

We regret to inform about the demise of our beloved mother **Smt. POKALA HEMAVATHI (AMMANNI)** on 18.03.94 at 3.30 AM. Final obsequies preformed on **27.03.94 at our residence, Plot No. 78, SBI Officers Colony, Moosarambagh, Hyderabaad 36**

**P. PANDURANGA RAO**
**P.V. RAO (RAGHU)**
**Farakka**

## నెల్లూరు జిల్లా బలిజ-తెలగ- కాపు సంఘం సంతాప సందేశం

సంఘ గౌరవ సలహాదారులు- చిరకాలంగా సంఘీయుల ప్రగతికి చక్కని సలహాలను అందచేస్తుండిన **శ్రీ గాదం రోశయ్య గారి** (పూర్వపు కౌన్సిలర్) మరణానికి చింతిస్తూ వారి ఆత్మకు శాంతినిచేకూర్చుమని దేవుని ప్రార్థిస్తూ వారి కుటుంబ సభ్యులకు మా ప్రగాఢ సానుభూతి తెలియ చేయుచున్నాము.

**పసుపులేటి విజయ్‌కుమార్ నాయుడు**
కన్వీనర్

కళాభూషణ్
**నీలకంఠం మునికుమార్ నాయుడు(రాము)**
అధ్యక్షులు

నెల్లూరు జిల్లా బలిజ-తెలగ- కాపు సంఘం

## పంచాంగం

తే 11 సోమ తెలుగు సంవత్సరాది
తే 14 గురు తమిళ సంవత్సరాది

### ఏప్రెల్ తిధులు

ఫాల్గుణ బహుళ

తే 9 శని చతుర్దశి రాత్రి గం.2.50ని వరకు
తే 10 ఆది అమావాస్య రాత్రి గం.4.36ని వరకు

### భావ సంవత్సరము

చైత్ర శుద్ధి

తే 11 సోమ పాడ్యమి పూర్తిగా
తే 12 మంగళ పాడ్యమి ఉ 6.50 వ
తే 13 బుధ విదియ ఉ 8.50 వ
తే 14 గురు తదియ ఉ 10.48 వ
తే 15 శుక్ర చతుర్థి ఉ 12.24 వ

స్వయంపాకుల శ్రీనివాసులు

## రేబాల గ్రామ పంచాయితీ టెండరు ప్రకటన

నెల్లూరు జిల్లా, బుచ్చిరెడ్డిపాళెం మండలం, రేబాల గ్రామ పంచాయితీకి 1994-95 సం.నకు ఈ దిగువ నుదహరించిన వస్తువులు సప్లయి చేయుటకు సీలు వేసిన టెండర్లు 13-4-94 వతేది మధ్యాహ్నం2.00 గం.ల వరకు పంచాయితీ కార్యాలయములో పంచాయితీ కార్యనిర్వహణాధికారి చే గాని లేక వారి అనుమతి పొందిన వారిచే గాని టెండర్లు స్వీకరించబడును. అదే రోజు సాయంత్రం 4-00గం.లకు హాజరు కాబడిన టెండరు దారుల సమక్షమున టెండర్లు తెరువ బడును. టెండర్లు దాఖలు చేయ గోరువారు ఆయా అయిటములకు ఎదురుగా చూపబడిన ధరావత్తు చెల్లించి రశీదును జతపరచ వలయును. ధరావత్తు చెల్లించని టెండర్లు నిరాకరింప బడును. టెండర్లు ఆమోదించుటకు, నిరాకరించుటకు కార్యనిర్వహణాధికారికి అధికారము కలదు. మిగతా వివరములు కార్యాలయము పనిచేయు వేళలో తెలుసుకొనవచ్చును.

| వ.నెం | వస్తువులు సరఫరా వివరము | ధరావత్తు |
|---|---|---|
| 1. | 1994-95 సం.మునకు వీధి దీపములకు అవసరమగు విడిభాగములు పంచాయితీకి దఫాల వారిగా సప్లయి చేయుట(అథరైజ్డు డీలర్స్‌మాత్రమే) | 100-00 |
| 2. | 1994-95 సం. మునకు పంచాయితీకి P.W.S. స్కీమునకు మరియు హ్యాండు బోరులకు సంబంధించిన విడి భాగములు దఫాలవారిగా సప్లయి చేయుట | 100-00 |
| 3. | ప్రజారోగ్య సామాగ్రి, బ్లీచింగుపౌడరు, ఫినాయిలు సున్నము, సప్లయిచేయుట | 25-00 |
| 4. | 1994-95 సం.మునకు స్టేషనరీ, మరియు యల్.యఫ్. ఫారములు సప్లయి చేయుట | 25-00 |
| 5. | పంచాయితీలోని చెడిపోయిన హ్యాండు బోరులను పైకితీసి బాగుచేసి మరలా బిగించుట1994-95 సం.నకు (హ్యాండుబోరు 1.కి రేటు) | 25.00 |

**(Sd.) B. కోటేశ్వరరావు**
కార్యనిర్వహణాధికారి,
గ్రామ పంచాయితీ కార్యాలయము, రేబాల

## పంచాంగం

2వ పేజీ కొరవ

విజేతయగుట వలన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములందు అధికారము మారదు. అయితే లగ్నమునందలి కుజుని వలన భాగ్యరాజ్యాధిపతులకు షష్టాష్ట స్థితిపాలన రాజకీయముగా ఆశ్చర్యకర పరిణామము లుండును. శని వ్యయభావములందు రెండు లగ్నములందుంట వలన ( జలలగ్న వర్గ లగ్నములు) పశ్చిమ దేశమంతా యుద్ధములు రక్తపాతము ఎక్కువగా కొనసాగును. కొందరు పశ్చిమ దేశాధినేతల హత్యలు గాని మార్పులుగాని జరుగును. లగ్నాధిపతి గురువునకు కుజ దృష్టివలన మన దేశమునందు రక్తపాతము, ప్రజానష్టము, వాహన ప్రమాదములు ఎక్కువగా నుండును. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములకు ప్రమాదములు లేవు. పంచమాధిపతి చంద్రునికి మంచి స్థితియుండుటవలన యంత్రాంగము బాగుండి దేశ రక్షణకు ఇబ్బందులుండవు. సమస్యలను చల్లార్చే ప్రయత్నములు నాయకులు చేయగలరు.

### గురుశుక్ర మౌఢ్యములు:

27-10-94 తేది గురువారము నుండి 7-11-94 తేది వరకు శుక్రమౌఢ్యమి జరుగును. 1-11-94 తేది నుండి 1-12-94 తేది వరకు గురుమౌఢ్యమి జరుగును. ఈ మౌఢ్య దినములందు శుభకార్యములు నిషేధము

### కర్తరి నిర్ణయము:

11-5-94 తేది బుధవారము నుండి 28-5-94 తేది శనివారము వరకు వాస్తు కర్తరి గృహనిర్మాణాది కర్మలు నిషేధము.

### పుష్కరము:

11-11-94 తేది గురువు వృశ్చిక రాశిలో ప్రవేశము వలన భీమా నదికి పుష్కరములు జరుగును.ఆ రోజు నుండి 12 దినము పితృకార్యములు నిర్వహించు కొనవచ్చును.

### గురు శనుల సంచారస్థలము:

గురువు 1-11-94 తేది నుండి వృశ్చిక రాశి సంచార మొనర్చుటవలన ఆగష్టునుండి మార్చి వరకు ప్రజానష్టము ఎక్కువగా కలగును. ప్రభుత్వమునకు సమస్యలు పెరిగి ఇబ్బందులనెదుర్కొనును. శని కుంభరాశియందు సంచరించుటవలన పశ్చిమ, ఉత్తర రాష్ట్రములందు, దక్షిణ రాష్ట్రములైన తమిళనాడు , కేరళ లందు ప్రకృతి ఉత్పాతములు రాజకీయ అశాంతి చెలరేగి జన నష్టము కలుగును.

### మకర సంక్రమణము:

ఈ సంవత్సరమున సూర్యుడు మకర రాశి ప్రవేశము 14-1-95 తేది రాత్రి 8.10 గం. లకు జరిగినది. అందువల్ల 15 తేది సంక్రాంతి పండుగ అయినది. 15 తేది పగలు 12-00 గం.లోగా పితృకార్యములు నెరవేర్చు కొనవలెను. ఈ మకర సంక్రాంతి పురుషుడు 'రాక్షస' నామధేయుడు. సంక్రాంతి పురుష లక్షణ ములను పరిశీలించి నపుడు ద్విజేతరులకు ప్రమాదములు ఎక్కువగా వుండవచ్చును. ప్రజాందోళనలు పశునష్టము, జననష్టము కలుగును. మొత్తంమీద ప్రజలు ఆరోగ్య, వస్త్ర , భోజన నివాస సౌఖ్యముల తోనే జీవించెదరు.

## చెన్నూరు 2వ పేజీ కొరవ

హోస్టయిల్‌గా మారినట్లు ప్రకటించింది. 18 తేది ఉదయం ఆరు గంటలకు చెన్నూరులోని కాంగ్రెస్ ఆఫీసు దగ్గర తన కుమారుడి శవం పడివున్నప్పుడు మాత్రమే తాను చూశానని సాక్ష్యం చెప్పాడాయన. తన కుమారుడు ఏ పార్టీకి చెందినవాడో తనకు తెలియదని. శవం చూసిన తర్వాత 9 గంటలకు పోలీసులు వచ్చి తనను గూడూరు స్టేషన్‌కు తీసుక వెళ్లారని. వారు అడిగిన దగ్గరల్లా పర్వతరెడ్డి శీనయ్య , జానా నారయ్యల ప్రోద్బలంతో సంతకాలు చేశానని అంతకు మించి తనకేమీ తెలియదని చెప్పారు. తనకిప్పుడు కళ్లు కన్పడడం లేదని ప్రకటించాడు. తానసలు పోలీసుకు హత్య గురించి రిపోర్టు చేయలేదనీ ప్రకటించాడు.

### పోలీసులు, ఆస్పత్రి లోపలకు రానివ్వలేదు.

రెండవ సాక్షి జానా బాయమ్మ. హతుడు జానావెంకటేశ్వర్లు తల్లి. హత్య జరిగిన రోజు రాత్రి 8 గంటలప్పుడు వీధిలో సందడిగా వుండడం చూసి తాను తన కోడలు ఇంటినుంచి బయటకు వచ్చామని. విచారిస్తే బజారులో గలాటా జరుగుతున్నదని చెప్పారని. దారిలో పంది వెంకట శేషయ్య శవం కన్పించిందని. తన కుమారుడి కోసం విచారిస్తే ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి, చేవూరు విజయమోహన్‌రెడ్డి కలసి కొట్టడంతో ఆస్పత్రికి తీసుక వెళ్లినట్లు తెలిసిందని, తాను మరికొందరితో కలసి గూడూరుకు కాలినడకన వెళ్లామని. అయితే పోలీసులు తమను ఆస్పత్రిలోకి రానివ్వలేదని, రాత్రంతా బయటే వుండిపోయాయని, తెల్లారి లోపలకు వెళ్లి చూస్తే తన కుమారుడి శవం మార్చురీలో వుండిందని చెప్పారామె. తాను ఇతరుల ప్రోద్బలం మీద తప్పుడు సాక్ష్యం చెప్తున్నాననడాన్ని తిరస్కరించారు.

### రాత్రంతా ఏడుస్తూ బయటే వుండిపోయాను

మూడవ సాక్షి జానా విజయమ్మ. ఆమె హతుడు జానా వెంకటేశ్వర్లు భార్య. ఆమె సాక్ష్యం ఇంచుమించుగా తన అత్త చెప్పినట్లే వుంది. ఆస్పత్రిలో వున్న తన భర్తను చూడడానికి పోలీసులు అనుమతించక పోవడంతో రాత్రంతా ఏడుస్తూ బయటే నిలబడి వుండినామని. తెల్లవారి మార్చురీలో శవం చూపించారని చెప్పిందామె. తన భర్తను ఎల్లసిరి, విజయ మోహనరెడ్డి లిద్దరే కొట్టి చంపినట్లు గ్రామంలో, ఆస్పత్రి దగ్గర తనకు చెప్పారని ప్రకటించిందామె. తనది అబద్ధపు సాక్ష్యమనడాన్ని ఖండించింది.

### దాడి చేసి చంపారు

నాలుగవ సాక్షి జానా నారయ్య. పర్వతరెడ్డి శ్రీనివాసులురెడ్డి వర్గంలో ముఖ్యుడు. ఎల్లసిరి సొసైటీ ప్రెసిడెంట్‌గా కాంగ్రెసుకు సంబంధించిన ఐదుగురు డైరెక్టర్లను తొలగించాడు. దీనిపై గ్రామంలో పంచాయితీ పెట్టాలనుకున్నాం. 17 తేది రాత్రి నేను మరికొందరు కలసి కాంగ్రెస్ ఆఫీసులో కూర్చుని వున్నప్పుడు దాదాపు 19 మంది ఆఫీసు దగ్గరకు వచ్చి అసభ్య పదజాలంతో తిట్టారు. వారు వెళ్లిపోగానే. మేము ఈ విషయం పర్వతరెడ్డి శీనయ్యకి చెప్పడానికి బయల్దేరాం. దారిలో తెలుగుదేశం ఆఫీసు వుంది. దాన్ని సమీపించగానే ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి తదితరులు కత్తులు, గొడ్డళ్ల, ఇతర మారణాయుధాలతో మా మీదకు దాడి చేశారు. గూడూరు రాజేశ్వరరెడ్డి అనే అతను పంది వెంకట శేషయ్యను గొడ్డలితో నరికాడు. అల్లూరు శంకరరెడ్డి, శ్రీనివాసులురెడ్డి అనేవారు జానా వెంకటేశ్వర్లును కత్తితో పొడిచారు. ఎల్లసిరి, ఈటెతో వెంకటేశ్వర్లును చీరారు. విజయ మోహనరెడ్డి కత్తితో గొంతుపై పొడిచాడు. అడ్డం పోబోయిన నన్ను, హరిబాబు అనే అతను గొడ్డలితో తలపైన కొట్టాడు. ఇంకొకరు ఇనుప కమ్మితో కొట్టారు. పారిపోబోతే మళ్లీ దెబ్బలు పడ్డాయి. నేను స్పృహ తప్పి పడిపోయాను. ప్రక్క రోజు ఆస్పత్రిలో స్పృహ వచ్చింది.

ఐదవ, ఆరవ సాక్షులు కూడా ఇంచుమించు ఇదే పోలికతో సాక్ష్యం చెప్పారు.

తక్కిన సాక్షుల కథనాలు మరొకసారి!

## నెల్లూరు సంగతులు

4వ పేజీ కొరవ

కొందరికి కృష్ణ నూతన వస్త్రాలు అందజేశారు. సభానంతరం ఫ్యాన్సీ దుస్తులు వేసుకొన్న చిన్న పిల్లలకు సదాశివగుప్త ఆయన శ్రీమతి సీతారత్నం బహుమతులు పంచిపెట్టారు. వికలాంగుడైన ఒక బాలునికి ఛైర్మన్ మూడు చక్రాల సైకిల్‌ను అందజేశారు. జరిగినకా ఈ కార్యక్రమానికి సంఘం సభగా కాక, ఒక ఇంటి శుభకార్యం అన్నట్లు, హార్దికంగా. కలుపుగోలుగా పెద్ద సంఖ్యలో వైశ్యులు హాజరయ్యారు. ఆవోపా జనరల్ సెక్రటరి ఎం.సత్యనారాయణ తొలుత స్వాగతం చెప్పారు. బి.పాండురంగం, ఎం.నరసింహారావు సభానిర్వహణను పర్యవేక్షించారు.

### నెల్లూరీయులబాలగాంధికి నంది అవార్డు

యువకవి జయంపు కృష్ణ స్క్రిప్ట్ సమకూర్చిన 'బాలగాంధి' టి.వి. సింగిల్ ఎపిసోడ్ ఈ సంవత్సరం ఉత్తమ ద్వితీయ బాలల చిత్రంగా నంది అవార్డును గెల్చుకుంది. నెల్లూరుకు చెందిన శ్రీమతి ఎన్.పద్మ ఈ చిత్రాన్ని నిర్మించారు. బాలగాంధీగా నెల్లూరు బాలుడు శైలేంద్ర, కరంచంద్‌గా సింహపురి సుధాకర్, పుతలీబాయిగా శ్యామలత ఇందులో నటించారు. కీర్తి సాగర్ దర్శకత్వపు బాధ్యతలు నిర్వహించారు.

# కోటకు మంచి ఛాన్స్ మిస్

సుహాసిని తొలిసారిగా దర్శకత్వం వహిస్తున్న "ఇందిర" తమిళ చిత్రంలో ఒక క్లిష్టమైన విలన్ పాత్రకు కోట శ్రీనివాసరావును ఏరికోరి బుక్ చేసింది. ఈ విషయం పాత్రికేయుల సమక్షంలో ప్రకటించి చాలా గర్వించారు కూడా. కేరళలోని ఒక కుగ్రామంలో ఓ శుభ మూహూర్తాన షూటింగ్ ప్రారంభమైంది. యూనిట్‌లోని సభ్యులు బస చేయడానికి నాలుగు లాడ్జిలు బుక్ చేశారు. ఒక లాడ్జిలో నాజర్, తమిళ హాస్య నటుడు "జనకరాజ్ తోపాటు కోటకు బస ఏర్పాటు చేశారు. మొదటిరోజు రాత్రి కోటకు, జనకరాజ్‌కు ఏదో విషయమై మాటా మాటా పెరిగింది. మందు మహాత్మ్యమేమో, మర్నాటికి అంతా సర్దుకుంటుందిలే," అనుకున్నార యూనిట్‌లోని వాళ్లు. కాని, షూటింగ్ సమయంలో ఆ నటులిద్దరూ ఎడమొహం, పెడమొహంగానే ఉన్నారు. రెండోరోజు ఆ తగాదా శృతి మించి ఘర్షణకు దారి తీసినట్లుంది. ఆ మర్నాడు ఉదయం కోట ఒంటిమీద చిన్న చిన్న గాయాలు కనిపించాయి. అంతే, కోట అదరా బాదరాగా సామాన్లు సర్దుకుని, ఎవరికీ చెప్పా చేయకుండా ఆ గ్రామం నుంచి జారుకున్నారు. సుహాసినికి ఈ విషయం తెలిసి ఎంతో బాధ పడింది. అప్పటికప్పుడు అందుబాటులో వున్న తిలకన్ అనే మలయాళ నటుడ్ని కోట స్థానే బుక్ చేసి, షూటింగ్ కొనసాగించింది. కోట ఒక మంచి అవకాశాన్ని జార విడుచుకున్నారు. అయినా, మించి నటిస్తున్నాడు తిలకన్," అనుకుంటున్నార యూనిట్‌లోని వారంతాఆ

### ఓల్డ్ ఈస్ గోల్డ్

1981 ఫిబ్రవరిలో విడుదలై సంచలనం సృష్టించిన "ప్రేమాభిషేకం" చిత్రం 13ఏళ్ల తర్వాత విజయవాడ 'కళ్యాణ చక్రవర్తి' థియేటర్‌లో మళ్లీ విడుదలై రెండు వారాలకు రూ.2,02,346 గ్రాస్. (షేర్. రూ. 1,20,000) వసూలు చేయడం గొప్ప విషయమే.


అన్న చిత్రంలో గౌతమి, దేవరాజ్

# ఆ సినిమాకు వచ్చే ప్రేక్షకులు కూడా దొంగ రాస్కెల్సేనా!

"దొంగ రాస్కెల్" టైటిల్ చాలా బాగుందంటూ అభినందిస్తూ అనేక చోట్లనుంచి అభిమానులు ఉత్తరాలు రాశారు" అని తెలియ జేయడానికి డైరెక్టర్ అనిల్‌కుమార్ ఒక ప్రెస్ మీట్ ఏర్పాటు చేశాడు. "కథ ఏమిటో తెలియకుండా ఆ టైటిల్ అనువుగా వుందని అంతమంది ఎలా రాశారు?" అని ఒక పాత్రికేయుడు అడక్కుండా ఉండలేక పోయాడు. "ప్రతి మనిషిలోనూ ఒక దొంగ రాస్కెల్ ఉంటాడు. నాలో ఒక దొంగ రాస్కెల్ ఉన్నాడు. మీలోనూ ఒక దొంగ రాస్కెల్ ఉంటాడు," అన్నాడు దర్శకుడు. ఐతే, "ఈ చిత్రాన్ని చూడవచ్చే వారిలోనూ దొంగ రాస్కెల్ ఉంటాడన్న మాట?" అని పాత్రికేయుడు ఛలోక్తి విసిరేసరికి ఏం జవాబు చెప్పాలో తోచక బిక్కముఖం వేశాడు డైరెక్టర్. వెంటనే ప్రేక్షకులకు టైటిల్‌ను ఆపాదిస్తూ పత్రికల్లో రాయకండి. ఆ తర్వాత మా సిన్మాను చూడడానికి ఎవరూరారు," అని వేడుకున్నాడు డైరెక్టరు!

### ఖంగుతిన్న నిర్మాత

ఔట్‌డోర్ షూటింగ్ జరుగుతున్నప్పుడు చుట్టూ మూగిన జనాన్ని చూసి దర్శకుడో, నిర్మాతో ఉత్సాహంగా కొన్ని ప్రకటనలు చేయడం మామూలు (అదో జబ్బు-అని కూడా అనొచ్చు). ఇటీవల విశాఖ పట్టణం దగ్గర అలా ఓ నిర్మాత చేసిన ప్రకటన బెడిసి కొట్టింది. ఒక సన్నివేశం చిత్రీకరింపబడుతున్న సమయంలో నిశ్శబ్దంగా ఉండి ఎంతో సహకరించిన జనాన్ని ఉద్దేశిస్తూ ఆ నిర్మాత "ఇటుపైన సంవత్సరానికి మూడు సిన్మాలు తీస్తాను. సంతోషమేనా?" అన్నాడు.

అంతే... గుంపులోంచి ఓ మనిషి కాస్త ముందుకొచ్చి, "మా సంతోషం మాట అటు ఉంచండి. సినిమాలు తీయడం మీ బిజినెస్. లక్షలకు లక్షలు సంపాదించడం మీ లక్ష్యం. అంతేగాని, ఏదో మమ్మల్ని ఉద్ధరించడానికన్నట్లు ఏటా మూడు సిన్మాలు తీస్తానంటారే! మీ సిన్మాలు బాగుంటే చూస్తాం. లేకపోతే తిప్పిగొడతాం. అంతే. దయచేసి ఇలా సిన్మాలతో దాడి చేస్తామని మమ్మల్ని బెదిరించకండి సార్!" అన్నాడు.

కొరవ 11 పేజీలో

# బాపూ బొమ్మలోనూ అసభ్యతా?

రొటీన్ చిత్రాలతో విసిగి వేసారిపోయిన ప్రేక్షకులు బాపు-రమణల చిత్రమని ఆశ పడిపోతే కొండంత నిరాశ మిగిల్చే చిత్రమే పెళ్లికొడుకు. ఇందులో 'బాపు' మార్కు సన్నివేశాలే కరువైపోయాయి. ఇటీవలే అరవయ్యోవ పడిలో పడిన బాపు మదిలో మళ్లీ నవ యవ్వనపు సరస శృంగారపు ఆలోచనలు పైకి తన్నుకవచ్చి తుళ్లింప చేసినట్లున్నాయి. విజయవంతమైన ఫార్ములా అంటే ఆడవాళ్లను ఎక్స్‌పోజ్ చేయక తప్పదన్న అభిప్రాయానికి వచ్చేసినట్లుంది ఆయనకూడా. వంపుసొంపులున్న ముదురు బాడీలను ఎంచుకున్నాడు. ఆర్కే రాజా కెమెరాను తన చీకట్లలో సైతం నటీమణుల ఎద, నడుము మడతలపై కేంద్రీకరించాడు. మరింత అందాల కనువిందు కోసం హీరోయిన్ చేత తరచూ ధవళ వస్త్రాలు ధరింపజేశాడు. ఒకచోట మరింత రెచ్చిపోయి న్యూడ్ మ్యాగజైన్‌లోని దిగంబర మూర్తిని దర్శనం కావించారు. పలుమార్లు హీరో, హీరోయిన్‌ను తన ఎదకేసి అదుముకొంటుంటే ఆ మహాతల్లి పైట, జార్చేస్తుంటుంది. వయసు మళ్లిన రమణ కలం సైతం రసికతలో మునిగి తేలింది. ఆరుద్ర - సినారె కలాలొలికించిన గేయాల్లో ' దొరసాని దిష్టి తగులుతుంది దాచుకో పరువాలు అంటూ సాగిపోతాయి. బాపు బొమ్మలా ఏ నటీమణీ ఈ చిత్రంలో కనిపించలేదు. అందరూ బాడీ బిల్డర్లే. కాసింత కథను 14 రీళ్లు సాగతీసినా ఒకింత హాస్యధోరణి వుండడం వల్ల చిత్రాన్ని చూడగలిగారు తప్ప.

ఒకింత హాస్యధోరణి వుండడం వల్ల చిత్రాన్ని చూడగలిగారు తప్ప.

**పెళ్లికొడుకు**

**బాపు రమణల ముద్రలేదు.**

**అల్లూరు రహీం**

లేకుంటే హాలు నుండి లేచి వచ్చేస్తారు ప్రేక్షకులు.

ఇక కథలోకి వెళితే రాణి రాజరాజేశ్వరిదేవి (సంగీత) పాతకాలంనాటి అహంకారం నిండిన అతివ. కోటీశ్వరురాలన్న భావన అణువణువునా ప్రదర్శిస్తూ భర్త, బిడ్డను లెక్క చేయదు. ఆమె భర్త రాజా (ఎవిఎస్) పుట్టిన రోజని చెప్పి కొడుకు వరహాల రాజా (నరేష్) కు అప్రకటిత స్వయంవరం ఏర్పాటు చేయిస్తుంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యంతో మనలేని కోట నుండి బయటకు వెళ్లి 'మనిషిగా బ్రతికే' మనసున్న అమ్మాయిని పెళ్లిచేసుకోమని బిడ్డకు సలహా యిస్తాడు రాజా. దాని ప్రకారం ఇంటి నుండి వెలుపలకు వస్తాడు వరహాలు. రావూజీ (ధర్మవరపు సుబ్రహ్మణ్యం) తెలివైన పథకంవేసి పీకల్లోతు కష్టాల్లో కూరుక పోయి వుండే రాధ (దివ్యవాణి) ని ప్రయోగిస్తాడు. ఆమె కూడా ఇంటి నుండి వచ్చేశానని చెప్పి వరహాలుకి తోడవుతుంది. బిడ్డను వెళ్లకను రాణి తన సర్వసైన్యాన్ని నమ్మినబంటు మల్లయ్య ( బాబూమోహన్) ని పంపుతుంది. ఈ మధ్యలో వరహాలు రాధ మధ్య ప్రేమ-జాతీయ రహదారిపై కాలినడకన సాగుతూ ముదురుతుంది. అమాయకుడైన వరహాలులోని నిజాయితీ ప్రేమకు రాధ పులకించి పోతుంది. కాని అతనికి వాస్తవం చెప్పక దూరమవ్వాలని ప్రయత్నిస్తుంది. దీంతో రాధ తనని మోసగించిందని తలచి తల్లిమాట విని పెళ్లికి సిద్ధమైన వరహాలుకి తండ్రి రాజా, నౌకరు మల్లయ్య రావూజీ ట్రాక్‌లో చిక్కిన రాధ నిజమైన ప్రేమ గూర్చి చెప్పి దంపతులను చేయడంతో

కొరవ 11 పేజీలో

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సర చందా రూ. 50/-
విడి ప్రతి రూ. 2.00



# కర్నూలు

మొదటిపేజీ కొరవ

ఉంటాయట. మిగిలినవన్నీ అక్రమంగా అట్టిపెట్టుకున్నవే. ఈ తుపాకుల వివరాలు పోలీసులకు తెలిసినప్పటికీ ముఖ్యమంత్రి అండదండలున్న కారణంగా పోలీసులు వారి ఛాయలకు కూడా వెళ్లే సాహసం చేయలేకపోతున్నారు. పరిస్థితి ఇదే మాదిరిగా కొనసాగితే కర్నూలు ఉప ఎన్నిక బ్యాలెట్‌తో కాక 'బులెట్లతో' జరుగుతుందని తెలుగుదేశం పార్టీ శేషన్‌కు విన్నవించుకుంది. ఎన్నికలకు ముందుగానే జిల్లాలోని తుపాకీ లైసెన్సులు రద్దు చేసి, అక్రమ తుపాకుల్ని స్వాధీనం చేసుకోవాలని. లేని పక్షంలో ఎన్నికలు స్వేచ్ఛగా జరిగే అవకాశం లేదని వారు శేషన్‌తో మొత్తుకున్నారు. శేషన్‌కు అందిన చిట్టాల్లోని వివరాలు ఇలా వున్నాయి.

కర్నూలు జిల్లాకు చెందిన ఎరుకులపాడు నారాయణరెడ్డి ముఖ్యమంత్రి బంధువు కావడంతో ఆయన అక్రమాలకు అడ్డూ అదుపు లేకుండా వుంది. దొంగసారా బట్టీలున్న ఇతను ఆ మధ్య ఎక్సైజ్ కానిస్టేబుల్‌పై కాల్పులు కూడా జరిపాడట. సాక్షాత్తు ప్రధానమంత్రి నియోజకవర్గంలోని వెల్దుర్తి మండలానికి చెందిన ఈయన జిల్లాలోనే కాకుండా కర్నాటకకు కూడా సారాను సరఫరా చేస్తున్నాడట. కర్నూలు జిల్లాకు చెందిన కాంగ్రెస్ ఎమ్మెల్యే శేషరెడ్డి సోదరుడు శివభూషణరెడ్డి సారా వ్యాపారంలో సిద్ధహస్తుడట. ఆ మధ్య ఎక్సైజ్ పోలీసులు ఇతన్ని అరెస్టు చేసి, తుపాకిని కూడా స్వాధీన పరచుకున్నారట. అయితే ముఖ్యమంత్రి ప్రమేయంతో ఆయనపై చర్య తీసుకోకపోగా తుపాకిని తెచ్చి భద్రంగా అప్పగించారట. ఇతనికి ఇద్దరు పోలీసుల రక్షణ కూడాఇచ్చారు. ముఖ్యమంత్రి సమీప బంధువులైన హనుమంతరెడ్డి, వెంకటేశ్వర రెడ్డి, రామకృష్ణారెడ్డికి సర్కారువారి రక్షణ ఇస్తున్నారు. ఆర్.ఇ. రవికుమార్ గౌడ్ కనీసం గ్రామ సర్పంచ్ కూడా కాదు. కానీ ఆయన ముఖ్యమంత్రి మద్దతుదారుడు కావటంతో ఆయనకు నలుగురు పోలీసుల రక్షణ వుంది. దొంగసారా వ్యాపారం, అక్రమ తుపాకులు ఈయన నేపథ్యం. లక్కసాగరం లక్ష్మిరెడ్డి వద్ద 25 అక్రమ తుపాకులున్నట్లు అంచనా. ఈయన మురాల పోరులో ఆరితేరినవాడు. అనేక హత్య కేసుల్లో నిందితుడు. ఈయనకు ముగ్గురు పోలీసుల్ని సెక్యూరిటీ ఇచ్చారు. మరో మద్దతుదారుడు కోడుమూరు మాజీ సర్పంచ్ సత్యనారాయణకు ముగ్గురు పోలీసుల్ని రక్షణగా పెట్టారు. ఎరుకల కృష్ణకు ప్రస్తుతం ముఖ్యమంత్రి సొంత ఊర్లో పునరావాసం కల్పించారు. మందీ మార్బలాన్ని మెయిన్‌టైన్ చేస్తారు. సుమారు 30 మారణాయుధాలు ఈయన దగ్గర వున్నట్లు అంచనా. ఆత్మకూరుకు చెందిన కేదారనాథ రెడ్డికి నలుగురు పోలీసుల రక్షణ వుంది. జలాని, రాఘవరెడ్డి ప్రభృతుల వద్ద అక్రమంగా తుపాకులున్నాయట.

కోట్ల విజయ భాస్కరరెడ్డి ముఖ్యమంత్రి అయ్యాక ప్రత్యర్థి వర్గాలకు చెందిన వారు హత్య గావించబడిన సంఘటనలు కూడా ఆ చిట్టాలో వున్నాయి.

కొసురోలు గ్రామంలో 5 హత్యలు, కప్పట్రాళ్లలో మరో అయిదు, పైలకుర్తిలో ఆరు, పసుపుల గ్రామంలో రెండు, చక్కరాళ్లలో అయిదు హత్యలు జరిగాయి.

## శేషన్ గరమ్ గరమ్

కర్నూలు ఉప ఎన్నిక సందర్భంగా జారీ చేసిన ఆదేశాలపై సుప్రీం కోర్టులో కేసు వేసి శేషన్‌కు అక్షింతలు వేయించి ముఖ్యమంత్రి సంతోషంగా ఉండగా శేషన్ మాత్రం కారాలు మిరియాలు నూరుతున్నాడు. తనను కలిసిన వారితో కూడా ఆయన ముఖ్యమంత్రిపై కష్టంగా మాట్లాడుతున్నాడు. ఇంతకాలం శేషన్ - కోట్ల మధ్య జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధం కర్నూలు ఉప ఎన్నిక సందర్భంగా రచ్చకెక్కింది. కర్నూలులో ఏం జరుగుతుందో తనకు ఎప్పటి కప్పుడు తెలియ చేయాల్సిందిగా శేషన్ సొంత గూఢచారులను నియమించు కుంటున్నారు. అప్పటికే కోట్ల ప్రత్యర్థులు శేషన్‌కు గూఢచారులుగా పనిచేస్తున్నారు.

## 50 ఏళ్ళ క్రితం
### ఈ వారం

తిన్నంగా యీ తీట దేవత తహసిల్‌దారింట్లో ప్రవేశిస్తే కట్టె బొగ్గు సప్లయి చక్కగా జరుగవచ్చునేమో ?

### కట్టె - బొగ్గు

ఈ రెంటికీ ప్రజలు పడే బాధ వర్ణనాతీతం. దినదినం హెచ్చుతున్నదేగాని తగ్గడం లేదు. కట్టెల కంటె బొగ్గు దర్శనమే దుర్లభమైంది. ఎప్పుడో తహశిల్‌దారు కుంభాభిషేకం చేయిస్తాడట. ఆ సుముహూర్తం యీ జన్మలో కనిపించలేదు. చాలా మంది లబలబలాడి పోతున్నారు.

### రాళ్లపల్లి వారింటిమీద రాళ్లు

"వారం రోజులుగా రాళ్లపల్లి నటేశయ్యగారి ఇంటి మీద రాళ్లు పడుతున్నవి. ఎక్కడ నుంచి వచ్చి పడేది ఎవ్వరికీ తెలియడం లేదు. చూచి వస్తామని పోయిన చుట్టు ప్రక్కల వారి మీద ఉమ్మి ముద్దలు పడుతున్నాయి. ఇది దైవ చిత్రమా? లేక గ్రహమాయా? ఇది నా కళ్ల ముందర జరిగిన విషయం" అని కామేశ్వరరావు గారంటున్నారు.

### మా జాగ్రఫీ పేపరు!

పబ్లికు పరీక్షలలో భూగోళ శాస్త్రం ప్రశ్నాపత్రం యే మహానుభావుని చేతినుంచి వచ్చిందోగాని ప్రశ్నాపత్రం చదువుకోటానికి మాత్రమే (కనీసం) 20 నిమిషాలు పట్టింది. నిండు 8 పేజీల ప్రశ్నలతో గూడిన ఆ ప్రశ్నాపత్రంలో 996 పదాలున్నాయి. అన్ని ప్రశ్నలు చదువుకోటానికే పట్టు 20 నిమిషాలు పోతే, అంత పెద్ద ప్రశ్నాపత్రముకు జవాబులు వ్రాయటానికి యింకెంత కాలం పడుతుందో వూహించండి! 40 నిమిషాలలో అన్ని అన్సర్లు పూర్తిచెయ్యాలని పరీక్షకుని భావం. కాని అది మానవ మాత్రులకు సాధ్యం కాని పని. అందువల్లనే చాలామంది విద్యార్థులు, అన్ని ప్రాంతాలలోనూ, చాలా ప్రశ్నలకు జవాబులు వ్రాయటానికి టైము చాలక వదలి వేయవలసి వచ్చింది. 1 1/2 గంట టైము వున్నట్లయితే బాగుండేది. లేదా ప్రశ్నల సంఖ్య తగ్గించి యున్నట్లయినా బాగుండెడిది. అట్లు చేయక, యీ విధంగా విద్యార్థులను పరీక్షించటం ఎక్కువమంది విద్యార్థులను తప్పించాలనే దృఢ సంకల్పంతో బైట పడటమని యూనివర్సిటీలోని అందరు విద్యార్థుల అభిప్రాయం.

-యన్.శ్రీరామమూర్తి.

## జనవాణి
(3 పేజీ కొరవ)

వుద్యోగులతోపాటు బయటి ప్రజలకు కూడా ఎంతగానో వుపయోగ పడుతుంది.

నెల్లూరు. -తిరుమూరు నారసింహారెడ్డి.

## ప్రజల్లో చైతన్యం లేదు!

ప్రజల్లో ప్రశ్నించే చైతన్యం రావాలన్న 'సణుగుడు' లోని మీ హృదయ వేదనను ఎందరు అర్థంచేసుకుంటారు? ప్రజల్లో అటువంటి చైతన్యం చూసి, సహించే గుండె నిబ్బరం , దానిపై ఆలోచించి తమ ప్రవర్తనలోని లోపాన్ని సవరించుకునే రాజకీయ వాదులు ఏ పార్టీలో వున్నారు చెప్పండి? ఒక వేళ ఎవరైనా సాహసించి ప్రశ్నిస్తే ఇక వారు పడే పాట్లు ఇబ్బందులనుండి ప్రజలకు ఎవరు రక్షణ కల్పిస్తారు ? ఏది ఏమైనా ప్రశ్నించే చైతన్యం, సాహసం ఇంకా మీవంటి పత్రిక వాళ్లల్లోనైనా వుండబట్టి ప్రజాస్వామ్యం కొన వూపిరితో మనగలుగుతోంది.

రాపూరు. -డి.ఎన్.నరసింహం.

## ఈ వైద్యం మంచిది

టౌన్‌లో చాలామంది పసిరికల వ్యాధితో బాధపడుతున్నారు. ఇటీవల జమీన్‌రైతులో ప్రచురించినట్లుగా ఆ వ్యాధికి మందు లేదు; కేవలం విశ్రాంతి మాత్రమే అవసరమన్నది సర్వజనాభిప్రాయం. కాని నిరపాయకరమైన ఒక మూలికారసం సత్వర పసిరికల ఉపశమనానికి ఎంతగానో తోడ్పడుతుంది. తెల్ల ముల్లంగి రసాన్ని ఆకులతో సహా పాతిక లీటరు తీసి తెల్లటి శుభ్రమైన గుడ్డలో వడగట్టి, ఎక్కువగా చక్కెర గలిపి మూడు పూటలూ పరగడుపున సేవించాలి. ఈ సేవనం ఆకలిని బాగా కల్గించి మలబద్ధకాన్ని నిర్మూలించి రోగికి తక్షణ ఉపశమనం కల్గిస్తుంది. మా తండ్రి ఈ రసంతో ఎందరికో వైద్యం చేసేవారు. ఆ రోజుల్లో ఆయన చెప్పగా విని, ఇప్పుడు పాఠకుల ముందు పెడుతున్నాను.

నెల్లూరు. -ఎస్.కామేశ్వరరావు.

## నూతన దంపతులకు సెక్స్ కౌన్సిలింగ్

లాజికల్‌గా ఆలోచిస్తే భార్యాభర్తలు సన్నిహిత మిత్రులు. కానీ భార్యను అదుపులో పెట్టుకోని పురుషుణ్ణి సమాజం 'హెన్‌పెక్డ్'గా పరిగణిస్తుంది. కాబట్టి భర్త, భార్యను అదుపుచేసే విధానాలు వెతుకుతుంటాడు. ఈ పరిస్థితిని చాలామంది స్త్రీలు ఎదిరించ లేకపోవచ్చు. కానీ అంతర్గతంగా ప్రతి స్త్రీ భర్తను తన యిష్టాయిష్టాలకు అనుగుణంగా మలచుకోవడానికి అవసరమయ్యే విధానాలను అన్వేషించడం సహజం. ఈ పద్ధతి తెలియకుండానే భార్య, భర్తల మధ్య శత్రుత్వం తెస్తుంది. ఆరోగ్యవంతులైన దంపతులు లైంగిక అసంతృప్తికి గురి కావడానికి ప్రధాన కారణమవుతుంది. ఈ నిగూఢమైన శత్రుత్వాన్ని ఆదిలోనే అంతమొందించను సెక్స్ కౌన్సిలింగ్ ఎంతగానో వుపయోగపడుతుంది.

నెల్లూరు. -డా.ఇ.రాజగోపాలరెడ్డి.

## కాన్వెంటు చదువులపై మోజు తగదు!

ప్రతి తల్లి, తండ్రి తమ పిల్లలకు విద్యాబుద్ధులను నేర్పించడంలో అభిరుచి పెంచుకొంటున్నారు. ఇది శుభ పరిణామమే. అభిరుచికి తగ్గట్టుగానే కాన్వెంట్లు, ట్యుటోరియల్స్ దండిగా పెరిగాయి. మరీ నెల్లూరులో ఎక్కువైనాయి. ఈ చదువుల కోసం ప్రత్యేక పుస్తకాలు, దుస్తులు, ఒకటేమిటి అంతా ప్రత్యేకతే. బయట ప్రపంచంతో సంబంధం లేకుండా కేవలం పుస్తకాల పురుగులను, లోకజ్ఞాన శూన్యులను తయారుచేసే ఫ్యాక్టరీల మాదిరి పనిచేస్తున్నాయవి. కాన్వెంట్లు, ట్యుటోరియల్స్ చదువులు సామాన్యులకు అందుబాటులో లేని పరిస్థితి కల్పించి వేలాది రూపాయలు గుంజుతున్నాయి. కాన్వెంట్లమీద ప్రభుత్వానికి ఎటువంటి అజమాయిషీ లేదు. ప్రతి బడ్జెట్‌లో ధరలు పెరిగినట్లు ప్రతి సంవత్సరం అన్ని స్కూళ్లలో ఫీజులు పెంచేస్తున్నారు. కనీస సౌకర్యాలు మాత్రం నాస్తి. అలా కాకుండా వీటిని రికగ్నైజేషన్ పరిధిలోకి తేవాలి. అన్ని విషయాలూ పరిశీలిస్తుండాలి. ముఖ్యంగా బోధన, ఇంగ్లీషు చదువుతోపాటు దేశభక్తి, జాతీయ సమైక్యతను గూర్చి పిల్లలకు వుద్బోధించాలి.

నెల్లూరు. -వాస్తు రామచంద్ర.

## సినిమా

(9 పేజీ కొరవ)

అంతే జనమంతా గొల్లుమని నవ్వారు. నిర్మాత తెల్లబోయాడు.

### మాజీ తార ఇంట్లో "తోడి కోడళ్లు"

నెంబర్ 12, బంజారా హిల్స్. హైదరాబాద్‌లోని అలనాటి తార జమున ఇంట్లో ఈ మధ్య సురేష్ ప్రొడక్షన్స్ "తోడి కోడళ్లు" చిత్రం షూటింగ్ జరిగినప్పుడు లక్ష్మి, జానకి, జయసుధ, రాజసులోచన, వాణీ విశ్వనాథ్‌లు పాల్గొన్నారు. వీళ్లు షూటింగ్‌లో పాల్గొన్నంతసేపూ జమున ఇంట్లో లేదట. "మనం ఉంటామని తెలిసే తప్పుకుందేమో! తామె రాజకీయాలలో ప్రవేశించింది. గనుక మనకన్నా ఒక మెట్టు పైగా ఉన్నట్లు భావిస్తుందేమో! అందట వాణీ విశ్వనాథ్.

### "ఇల్లుచూడు -దేశం చూడు"

పై పేరున తెలుగు రూపాంతరం పొందబోతున్న "వీట్టై పారు, నాట్టై పారు" అనే తమిళ చిత్రంలో రాజకీయ నాయకుల్ని అవహేళన చేస్తూ, తూలనాడడం జరిగిందని నిరసన తెలియచేస్తూ ఒక తమిళ రాజకీయవేత్త కొన్ని తమిళ దిన పత్రికల్లో ప్రకటనలు చేశాడు. ఆ ప్రకటనలను యథా ప్రకారం పోస్టర్లలో ముద్రించి, అంటింప జేసేసరికి ఆ చిత్రం మరింత ఊపందుకుందని పంపిణీదారులు తమ హర్షాన్ని వెలిబుచ్చారు!.

### "రాజా రాణి"

చాలా కాలం తర్వాత విజయశాంతి "రాజా రాణి" అనే తమిళ చిత్రంలో నటిస్తోంది. ఆమెది (ఐ.ఎ.ఎస్.) కలెక్టర్ పాత్ర. హీరో సత్యరాజ్ (ఐ.పి.ఎస్.) పోలీస్ అసిస్టెంట్ కమీషనర్. సంగీతం: ఇళయరాజా. దర్శకత్వం : జోషి. ఈ చిత్రం తెలుగు డబ్బింగ్ దీపావళికి విడుదల అవుతుంది.

## చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

కథ ముగుస్తుంది.

దీనిలో కామెడీ కోసమని సృష్టించిన గుర్నాథం ( కోట శ్రీనివాసరావు) అబ్బులు (బ్రహ్మానందం) సబ్బులు ట్రాక్ కథలో ఎక్కడా కలవదు.

అద్యంతం అహంకారం నిండిన రాణి పాత్రను సంగీత పోషించలేక పోయింది. దానికి తోడుగా డబ్బింగ్ కూడా చెప్పించడంతో ముఖ కవళికలకు డైలాగులకు పొంతన కుదరలేదు. అమాయకునిగా వరహాలరాజు పాత్రను నరేష్ చక్కగా చేశాడు. పెళ్లిపుస్తకంలో నటించి బాపు బొమ్మలా అనిపించిన దివ్యవాణి చిత్రంలో పళ్లుపెరగడం వల్ల దిబ్బలా కనిపిస్తుంది. నటన మాత్రం పరవాలేదు. సమ్మిన బంటు క్యారెక్టర్‌ను బాబుమోహన్ వెరైటీగా పోషించాడు. ఎవిఎస్, కోటశ్రీనివాసరావు, బ్రహ్మానందం , తమదైన ధోరణిలో సాగారు. ఇందులో బాబుమోహన్, బ్రహ్మానందాలకు చిరాకు పాట పెట్టారు బాపు. ఎవిఎస్ తిక్కమాటల్లో బాబుమోహన్ తెలంగాణా యాస సరదాగా వున్నాయి. చిత్రం మొదలు కాగానే పాత్రలను బుర్రకథ రూపంలో పరిచయం చేయడం, హీరో అర్జెంట్ పెళ్లికోసం కన్యాశుల్కం అడగడం, చివరన పెళ్లిబృందం రోడ్డమ్మట పరుగెత్తడంలో బాపుమార్కు కనపడుతుంది. కీరవాణి సంగీతం సాదా సీదాగా వుంది. అర్కేరాజు కెమెరా మసక చీకట్లోనైతం మణులు గొలిపింది. చాలా రోజుల తరువాత నృత్యం సమకూర్చిన శ్రీనివాస్ సాదా సీదా బాణీనే అనుకరించాడు. చిత్రంలోని ఒక రసవత్తర సన్నివేశంలో హీరోయిన్ రవిక తీసి రెడీ అన్నా... హీరో నిజమైన ప్రేమికుడు కాముకుడు కాదంటూ వెనుతిరిగే సన్నివేశం నిజమైన ప్రేమను ఆవిష్కరిస్తుంది. శుభం కార్డు పడ్డాక మళ్లీ బ్రహ్మానందం జంటను ఎందుకు తెరపై ప్రత్యక్షం చేశారో అర్థంకాక తలలు పట్టుకోవాలి ప్రేక్షకులు. మొత్తానికి బాపు. రమణ స్వంత చిత్రం వాళ్లతోపాటు ప్రేక్షకులకు కూడా నిరాశే మిగిల్చింది.

## పెన్నా బ్రిడ్జి

4వ పేజీ కొరవ

మంత్రిగారు చెప్పారు. ఇ.బి.సి.లు, బి.సి.ల భూముల అభివృద్ధికి 2 కోట్లు ఖర్చు పెడతారు. అదే విధంగా ఎస్.సి., ఎస్.టి.లు నివసించే ప్రాంతాల్లో త్రాగునీళ్లు, రోడ్డు సదుపాయం కల్పించడానికి 8 కోట్లు వెచ్చించనున్నారు. ఎంపీల లోకల్ ఏరియా డెవలప్‌మెంటు పథకంలో మంజూరైన ఐదేసి లక్షలను కుమారి పద్మశ్రీ. మాగుంట సుబ్బరామిరెడ్డి, ఎ.సర్వారాయ చౌదరి నెల్లూరు జిల్లాకు కేటాయించారు. పద్మశ్రీ గారు మాత్రం తన నిధులను ఆడపిల్లల హైస్కూళ్ల అభివృద్ధికే ఖర్చు పెట్టనున్నట్లు చెప్పారు. మగ పిల్లలు ఏం పాపం చేసుకున్నారో మరి!

జిల్లాలోని 31 వెనుక బడిన మండలాల్లో ఉపాధి గ్యారంటీ పథకాన్ని మంజూరు చేయమని రాష్ట్ర ప్రభుత్వాన్ని అర్థించారు. గ్రామీణ ప్రాంతాల వారికోసం సొంత మరుగుదొడ్ల నిర్మాణ పథకాన్ని ప్రకటించారు. రెండు రకాల పథకాలు ఇందులో వున్నాయి. రెండువేల రూపాయల పథకంలో రూ.400 లబ్ధిదారుడు చెల్లిస్తే, 1600 డి.ఆర్.డి.ఎ. ఇస్తుంది. మరో పథకం విలువ రూ.2500, ఇందులో రూ.500 లదారు చెల్లిస్తే, రూ.1000 బ్యాంకు ఋణం, మరో వెయ్యి సబ్సిడీగా ఇస్తారు. 11 వేల ఆదాయం వున్న ఎవరైనా వీటికోసం అప్లికేషన్ పెట్టుకోవచ్చు. నిధులు చాలా వున్నట్లున్నాయి; ఎందరు దరఖాస్తు చేసుకున్నా మంజూరు చేస్తారట. టౌన్‌లకు మరోసారి చూస్తామని కలెక్టర్ చెప్పి ముగించారు

అభాగ్యుల కోసం పనిచేస్తే జీవితం ధన్యం !

---

# అశ్రుతర్పణం

## మా అభివృద్ధికారకుడు - మా మార్గదర్శి మా దైవం



జననం : 15-6-1916

## శ్రీ జొన్నా వెంకయ్యశెట్టిగారు

(తలమంచి, కొడవలూరు మండలం)

**25-3-1994** న స్వర్గస్తులైనారు. వారి ఆత్మకుశాంతి చేకూరాలని కోరుతూ.....

జొన్నా కాంతమ్మ - భార్య

### కుమారులు- కోడళ్ళు

జొన్నా వీరాస్వామి నాయుడు - యోగాంబ
జొన్నా వెంకయ్యVAO - వసంత
Dr. జొన్నా చంద్రశేఖర్- శైలజ

### కుమార్తెలు- అల్లుళ్లు

దూది రామలక్ష్మమ్మ - దొరస్వామి
దూది దేవసేనమ్మ- వెంకయ్య
సమయం లలితమ్మ- రాఘవయ్య
పూరుబిండి విమలమ్మ-ప్రభాకర్
సాగి శ్యామలమ్మ - శ్రీనివాసులు

### మనుమలు - మనవరాళ్ళు

జొన్నా వంశీకృష్ణ
జొన్నా కళ్యాణ్ చక్రవర్తి
జొన్నా శశాంక
దూది రామలక్ష్మి
జొన్నా కిరణ్మయి
జొన్నా విష్ణువందన
జొన్నా జోతిర్మయి
జొన్నా సింధూర

దూది శివకుమార్
దూది సుభాష్‌బాబు
దూది రవికుమార్
దూది హరిబాబు
సమయం సత్యప్రసాద్
పూరుబిండి విశ్వనాథ్
సాగి కృష్ణచైతన్య
సాగి శ్రీహర్ష

### మనుమలు - మనవరాళ్ళు

జొన్నా ఝాన్సీలక్ష్మి
దూళిపూడి నళిని
పుష్పాల మాధవి
యన్ సునంద
పెద్దిశెట్టి సుచిత్ర

### మునిమనవళ్లు - మనవరాళ్ళు

కార్తీక్-సందీప్-లక్ష్మీప్రసన్న-గౌతమ్-పవన్‌సాయి- అనూష-తరుణ్-అభిషేక్

పెద్దకర్మ **16-4-1994** వ తేదిన తలమంచిలో
మా స్వగృహమున జరుగుతుంది

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,